# సుగ్రీవవిజయము

(యక్షగానము)

కర్త :

కందుకూరి రుద్రకవి

పీఠికాకర్త :

డా॥ జి.వి.సుబ్రహ్మణ్యం, ఎం.ఏ., పి.హెచ్.డి.,
రీడరు, హైదరాబాదు సాయంకళాశాల, హైదరాబాదు.

ప్రకాశకులు :

మాధవి బుక్ సెంటర్

Opp. ఆర్యసమాజ్ మందిర్

సుల్తాన్ బజార్, హైదరాబాదు.

# ఆ ము ఖ ము

గాన మనినతోడనే మనకు స్ఫురించువారు యక్ష కిన్నర గంధర్వులు. పాటకు వారి ఫణుతులే పరమప్రమాణములు. అందు గాంధర్వవిద్య దేవలోక మున వర్తించునది యని సంగీతశాస్త్రజ్ఞుల యభిప్రాయము. శాస్త్రీయసంగీత పద్ధతిలో నది నరుల కందని ద్రాక్షపండువంటిది. ఈ యంశమును పింగళి సూరన కళాపూర్ణోదయ ప్రబంధమున నారదతుంబురగానమాత్సర్య వృత్తాం తమున సూచించియున్నాఁడు. దేవర్షియైన నారదుఁడు గంధర్వుఁడైన తుంబు రుని గాంధర్వసంగీతవిద్యా పాండిత్యమున మించుటకై దైవాంశసంభూతుఁడైన శ్రీకృష్ణుని శిష్యత్వము నెఱపిన ట్లా కథలో వర్ణింపఁబడినది. అనఁగా గాంధర్వ సంగీతవిద్య మార్గసంగీతమునకుఁ బరాకాష్ఠయను తాత్పర్య మేర్పడుచున్నది. అయినచో యక్షకిన్నర సంగీతఫణుతు లెటువంటివి? అను మీమాంస వచ్చును. కిన్నరులు సామాన్యముగా విజయగీతములను, శృంగారగీతములను సామూహిక ముగా (Chorus) గాని, జంటలు జంటలుగాఁగాని పాడుచుండుటను వర్ణించుట ప్రాచీన సంప్రదాయము. గధర్వులు శుద్ధరాగ ప్రస్తారకులైనచోఁ గిన్నరులు గేయగాన కోవిదు లనఁదగియున్నారు. అనఁగా గంధర్వసంగీతమునందు కంటె కిన్నరగానమునందు సాహిత్య స్పర్శ యెక్కువ యని యూహింప వీలగు చున్నది. యక్షులు గంధర్వ కిన్నరులవలె శుద్ధరాగ గేయగానములందే కాక నృత్యాభినయములందును ప్రావీణ్యముకలవారుగాఁ గానఁబడుచున్నారు. యక్షులు కామరూపులని ప్రసిద్ధి. కోరిన రూపములను ధరించి పాత్రోచితముగా నాట్యము చేయుచు గాన మొనరించు నేర్పు వారికి వెన్నతో వచ్చిన విద్య. యక్షులయందు గంధర్వ కిన్నరాదులందుకంటెరూపకప్రక్రియరూపుకట్టుట కనువైన గానఫణితి వెలయుట కవకాశమున్నది. కావున యక్షగాన మనఁగా నృత్త నృత్య నాట్యాభి నయ విశిష్టమైనగాన మనియు, సంగీత రూపక సంప్రదాయమునకు మూలబీజ మనియు గానము భావింప వచ్చును.

యక్షప్రశంస :

యక్షప్రశంస వేదవాఙ్మయమునుండి వినవచ్చుచున్నది.
'యేన కర్మాణ్యపసో మనీషిణో
యజ్ఞే కృణ్వంతి విదధేషు ధీరాః
యదపూర్వం యక్షమంతః ప్రజానాం
త న్మేమనః శివసంకల్ప మస్తు"[1]

ఇత్యాది వేదమంత్రము లందులకుఁ బ్రమాణములు. తరువాత బ్రాహ్మణ, బౌద్ధ, జైన సారస్వతములయందును యక్షప్రశస్తి కలదు. జైమిని బ్రాహ్మణము నందు విచిత్రమైన వస్తువను నర్థమున యక్షశబ్దము వాడఁబడిన దనియు, గుహ్య సూత్రములలో భూతాదులతో పాటు యక్షావాహనముగూడ కలదనియు. వారు రోగ గ్రహావేశశక్తులుగాఁ బేర్కొనఁబడి రనియు, బౌద్ధసారస్వతమున యక్షులు నీతిప్రవర్తకులుగాను, రక్షకశక్తులుగాను గీర్తింపఁబడి రనియు, బౌద్ధశిల్పము లందు యక్షయక్షిణీ ద్వారపాలక ప్రతిమలు గానవచ్చుచున్న వనియు, జైన సారస్వతమునందు వారు కామరూపులుగను, దయాళువులుగను రక్షణచణులైన రణశూరులుగను బ్రశంసింపఁబడి రనియు, వాల్మీకిరామాయణమున యక్షత్వ మమరత్వమువలె దివ్యపదమనియు, భారతమునయక్షులుధర్మపరాయణులనియు, జిజ్ఞాసువులనియు, శైలజలవనదేవత లనియు సూచింపఁబడినదనియు, భట్టి కావ్యమున యక్షులు స్తోత్రపాఠకులనియు, కాళిదాసుని మేఘసందేశమున నృత్యగీత సంగీతప్రియులనియు, బ్రాహ్మణబౌద్ధజైన సారస్వతములందు వారు మహిమాన్వితులుగను, దేవయోనులుగను, మాయావిద్యానిపుణులుగను, రాక్షసకల్పులైనరాజస శక్తులుగను, కుబేరానుయాయులుగను బేర్కొనఁబడి రనియు విమర్శకులు తెలిపియున్నారు.[2]

'రామాయణమున దక్షిణహిందూదేశ' మను వ్యాసమున శ్రీ వి. ఆర్. ఆర్. దీక్షితారుగారుయక్షులుపూర్వము సింహళమునరాజ్య మేలుచుండిరనియు, బలి

1. చూడు : సీతా కల్యాణము. (యక్షగానము) తొలిపలుకు 'వాఙ్మయ మహోధ్యక్ష శ్రీవడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు. పుట. vi.
2. చూడు : ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర. ప్ర. భా. పుట. 3-5.

చక్రవర్తి సేనానియగు సుమాలి వారి నోడించి యచ్చట రాక్షసరాజ్యముస్థాపించె ననియు, రాక్షసరాజ్య మంతరించిన తరువాత మఱల యక్షులు సింహళమున రాజ్యమును స్థాపించుకొని క్రీ. పూ. 5వ శతాబ్దివఱ కచ్చట పరిపాలనము సాగించి రని 'మహావంశ'మను గ్రంథమువలన దెలియుచున్న దనియు, వారు రాక్షసవంశశాఖకుఁ జెందినవా రనియు వ్రాసియుండిరి. మఱికొన్ని గ్రంథముల వలన యక్షప్రభువైన కుబేరుఁడు లంకాధిపతి యనియు నతనిని రావణుఁ డోడించి రాజ్య మాక్రమించుకొనఁగా, నాతఁడు సపరివారుఁడై దక్షిణ భారత దేశమునకు వలస వచ్చెననియుఁ దెలియుచున్నది. దీనిని బట్టి యక్షులు దేవ యోనులే కాక మానవులవలె భౌమజీవు లనియు స్పష్ట మగుచున్నది. ఈ యంశములను బలపఱచు కథాసాక్ష్యములను బ్రహ్మవైవర్త, శివపురాణముల నుండియు, ఉత్తరరామాణమునుండియు విమర్శకులు చూపించుచున్నారు.[3]

కుబేరవంశీయులైన యక్షులకును, ఆంధ్రులకును సంబంధ బాంధవ్యము లున్నవని శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు పేర్కొనుచున్నారు: "ప్రత్యేకించి కళింగ రాజ్యాధినేత అయిన అరిందముని కుమారుఁడుగా, దముఁడుగా పుట్టాడన్న విషయం చూస్తే ఆంధ్రులకు, కుబేరుడికీ, కుబేరజాతికీ సంబంధం ఉండి తీరాలన్న విషయం తేటతెల్లమవుతోంది. కళింగులు, ఆంధ్రులు భిన్నులన్న అభిప్రాయం కొందరిలో వున్నా ఒకవిధంగా వీరు ఆగర్భసోదరులే! విశ్వామిత్ర శాపదష్టులైన పుత్రులు ఆంధ్రులయ్యారని కథవున్నా ప్రముఖ వేద ఖగోళశాస్త్రజ్ఞుఁడైన మహర్షి దీర్ఘతముని (మామతేయుడు) పౌత్రులుగా కూడా ఆంధ్రజాతి ఒకటి ఉన్నట్లు స్పష్టమౌతున్నది. 'బలి భార్య అయిన సుధేష్ణకు దీర్ఘతమ మహర్షి సంయోగానుగ్రహంతో అంగరాజు జన్మించాడు. ఈ అంగరాజుకు వంగ, కళింగ, సింహ, ఆంధ్రపుత్రులు కలిగారు' అని భారత భాగవతాలు పేర్కొన్నాయి. కాగా వంగులు, కళింగులు, సింహులు, ఆంధ్రులు అన్నదమ్ములన్నమాట! ఒక తండ్రిబిడ్డలే నన్నమాట! దీర్ఘతముని వంశీయులైన కళింగులు పాలించిన దేశాధీశుఁడైన అరిందమునికి పుత్రుడై పుట్టిన దముడు కుబేరుఁడై అలకాధిపత్యాదులు పొందినా కళింగుడే కదా! తొలుత పరిస్థితి ఏమైనా కళింగాంధ్రాలు దేశపరంగా వొక్కటే. మఱి యక్షరాజైన

3. చూడు : సీతాకల్యాణ యక్షగానము–తొలిపలుకు. పుటలు x నుండి xiii

కుబేరుఁడు ఒకప్పుడు సరిహద్దుదేశమైన కళింగదేశంలో వున్నా ఆంధ్రుల సోద రుడుగా తరువాతి ఆంధ్రదేశంలో ఉన్నట్లేకదా ! కాగా అత్యంత ప్రాచీనకాలం లోనే దేవయోనిభేదజీవులైన యక్షులతో కళింగాంధ్రులకు సంబంధబాంధవ్యా లున్నట్లు విస్పష్టంగా అర్థమవుతున్నది. దీర్ఘతమ మహర్షి వంశీయులైన వంగ, కళింగ, సింహాంధ్రుల విషయమూ, కళింగాధిపుడైన అరిందముని పుత్రు డైన దముని కుబేరత్వ విషయమూ, తమ దృష్టికి రానందువల్ల కాబోలు, కీర్తి శేషులు శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు 'యక్షులు' 'అక్షన్' (Oxus) నదీ ప్రాంతంవారో, లేదా 'యఛి' (yuchi) అనే మంగోల్ జాతివారో అయి వుంటా రని కొన్ని అభిప్రాయా లున్నట్లు ప్రతిపాదించారు."

యక్షరాత్రి :

క్రీ. పూ. 3, 4 శతాబ్దములలో వెలసిన వాత్స్యాయన కామసూత్రము లందు 'యక్షరాత్రి' ప్రసక్తి కలదు. అదియొక ద్యూతక్రీడ యని యశోధరుని జయమంగళవ్యాఖ్య వివరించినది. యక్షరాత్రి కీ వ్యాఖ్యానము ననుసరించి అక్షరాత్రి యను భావ మేర్పడుచున్నది. పక్షరాత్రి యను పాఠభేదము కూడ కలదని కొందఱి యభిప్రాయము. జయమంగళుని వ్యాఖ్య నిర్దుష్టము కాద నియు, యక్షరాత్రి పదము ద్యూతక్రీడ యను నర్థమున వాడఁబడ లేదనియుఁ దైవారాధన పరమైన యుత్సవపరముగాఁ బేర్కొనఁబడిన దనియు కొందఱు భావించుచున్నారు.

క్రీ. శ. 11, 12 శతాబ్దములలో నున్న హేమచంద్రుఁడు తన దేశీ నామమాలలో యక్షరాత్రికి ప్రాకృతరూపమైన 'జక్ఖరత్తీ' యను శబ్దమునకు దీపావళి యను నర్థము చెప్పియున్నాఁడు. నేపాళదేశమున ధనాధిదేవతయైన లక్ష్మీదేవికి దీపావళినాఁడు పూజలు జరుగు ననియు,నందు జూదములతిరువాళ్ళు జరుపుకొను నాచారము కలదనియు ననునంశము దాని కుపబలకముగా నున్నది.

కర్ణాటక యక్షగాన పరిశోధకులు శ్రీ యం. గోవిందరావుగారు కన్నడ దేశమునందలి దక్షిణ కనరా మండలమున గల మందర్తి, మర్ణకట్టె, కటిల్, ధర్మస్థల దేవాలయములందు యక్షగానమేళములవారు దీపావళినాడు తమ యిష్ట దైవములనుగూర్చిన యుత్సవములు చేసికొను నాచారము కానవచ్చుచున్న దని పేర్కొని యుండిరి. శ్రీముళియ తిమ్మప్ప యను మఱియొక కన్నడవిమర్శ

కుఁడు కుబేరుఁడు బలిచక్రవర్తి నుండి లంకారాజ్యమును దిరిగి పొందిన సందర్భమును దీపావళి పండుగగా జరుపుకొను నాచారము కల దని తెలిపియుండిరి. వీరి వాదమును గొంద అంగీకరించుట లేదు. శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు యక్షిణులలో తులసియక్షిణి శక్తిమంతమైన దని మంత్రశాస్త్ర ప్రసిద్ధమనియు, కార్తిక పూర్ణిమనాఁడు జరుగు తులస్యుద్వాసన మహోత్సమునే యక్షులు పండుగగా జరుపుకొనువా రనియు, దానికి యక్షరాత్రి యను పేరు వచ్చియుండవచ్చు ననియు భావించిరి. మొత్తమునకు యక్షరాత్రి యను సంప్రదాయము యక్షు లొనర్చుకొను ఉత్సవవిశేష మనియు, నది దీపావళి కావచ్చు ననియు, నందు వారు నృత్యగీతాదులతోడనే కాక, ద్యూతక్రీడాదులతోఁగూడ వేడుకలు జరుపుకొనుచుండెడివారనియు, నట్టి సంప్రదాయము గుజరాతు, మార్వారు, నేపాలు, కర్ణాటక ప్రాంతములయందు వ్యాపించియున్న దనియుఁ దెలియుచున్నది.

**యక్షులు—జక్కులు :**

> 'విద్యాధరోఽప్సరో యక్షో రక్షో గంధర్వకిన్నరాః.
> పిశాచో గుహ్యక స్సిద్ధో భూతోఽమీ దేవయోనయః'

యక్షులు విద్యాధరాదులవలె దేవయోనులే కాక గానలోలులు.

> 'యక్షా శ్చ నాగాఽపి కిన్నరా శ్చ
> గాంధర్వముఖ్యాఽపిగానలోలాః'.

గానలోలుపత్వముతో పాటు కామరూపత్వము వారి ప్రత్యేకలక్షణము. ఇట్టి దేవయోనులు భౌమజీవులునై యుండి రనుటకుఁ దార్కాణములు వెనుక చూపఁబడియున్నవి. కాని, భౌమజీవులైన యక్షులు క్షాత్రధర్మము నెఱపినట్లు కానఁబడుచున్నది. మానవరాజవంశములందు యక్షరాజవంశము లను ప్రత్యేక ప్రసిద్ధి కానవచ్చుట లేదు. అట్లగుటచే యక్షగానప్రవర్తకులైన యక్షు లెవరను ప్రశ్న యుదయింపఁగలదు.

నృత్యగానలోలులై బహురూపప్రక్రియను జీవికకై స్వీకరించి జీవించు నొక జాతివారికి యక్షనామము ప్రసిద్ధమై అన్వర్థముగా నిలచియుండవచ్చు ను. అట్టిజాతులు కర్ణాటాంధ్రదేశములం దున్నట్లు నిదర్శనములు కానవచ్చుచున్నవి.

'యక్ష' శబ్దమునకు వికృతులుగాఁ గన్నడమున 'ఎక్క' యు, తెలుగున 'జక్క'యుఁ గానఁబడుచున్నవి. కన్నడకవులలో అభినవపంపఁడు, అగ్గళుఁడు 'ఎక్కలు' 'ఎక్కలగాణలు' అను శబ్దములను, రత్నాకరవర్ణి 'ఎక్కడిగలు' అను శబ్దముగా వాడియుండిరి. ఆంధ్రకవులు యక్షశబ్దమునకు మారుగా, జక్కులు, జక్కిణి శబ్దములను వాడియుండిరి. 'జక్కుపేడు' (జక్కులజాతి వాఁడు), 'జక్కులఱేడు' (కుబేరుఁడు), మొదలగునవి యిట్టివి. 'జక్క' శబ్ద ప్రయోగవిచారముచేయుచు శ్రీ పడ్లమూడి గోపాలకృష్ణయ్య గా రిట్లు వ్రాసియు న్నారు:

"జక్కిశబ్దానికి గుర్రం అని 'కట్టుపడిపోవటం' అనీ అర్థా లున్నాయి. చివరికి 'జక్కిమోర' అన్నశబ్దం తెలుగులో(అశ్వముఖులకు) కిన్నరుల కుపయో గించారు పూర్వులు. 'జక్కిఒడలు' వంటిపదాలను రూపొందిస్తే కింపురుషులు (నరముఖం, అశ్వశరీరం కలవారు) అని కూడా అర్థంవస్తుంది. జక్కులు బహు వచనరూపం చూస్తే దాని ఏకవచనరూపం విస్మృతవ్యవహారంలో లేకపోయినా 'జక్కి' ఉన్నదని స్పష్టపడుతుంది. అసలు 'యక్ష' శబ్దమే' యక్షిఅయి 'జక్కి'గా మారిందని స్పష్టంగా అర్థమవుతున్నది యక్షిణీవిద్య అని 'యక్షిణి' అని కని కట్టు విద్యపట్ల, ఇంద్రజాలంపట్ల ఉపయోగిస్తాము. లేనిదానిని ఉన్నట్లుచూపడం కనికట్టువిద్యలక్షణం. యక్షుల కామరూపత్వం ఇటువంటి విద్యలన్నింటికీ మూల మనడంలో సందేహంలేదు. 'జక్కి' అంటే 'కట్టువడిపోవటం' అని తెలుగులో అర్థం ఉన్నదని పేర్కొన్నాను. దానికిమూలరూపమైన 'యక్ష' శబ్దానికి కూడా 'కట్టి వేసేవాడు' అనిఅర్థం ఉన్నది. వివిధవిద్యలతోపాటు నృత్యగానాది విద్య లతో కూడా కట్టివేయగలవారు-తన్మయాంబుధిలో ముంచగలవారు కాబట్టే వారికి 'యక్షు' లన్న పేరు వచ్చివుండవచ్చు"[4].

'యక్ష' శబ్దవాచ్యులైన దేవయోనులయందుఁ బ్రకటితము లగు నృత్యగా నాదిలక్షణవిశేషములు వృత్తులుగా గలిగిన మానవులలో నొకజాతిని యక్షులనియు ఎక్కులనియు, జక్కులనియు పిలుచుట పరిపాటియైనదని పైశబ్దవిచారముల వలన మనము సులభముగా గ్రహింపవచ్చును. కన్నడదేశమున, 'ఎక్కడిగలు, ఎక్కడిగాణలు' అని పిలువఁబడు నీ తెగవారు నేఁడు కానవచ్చుట లేదు. కాని

---

4. సీతాకల్యాణము [యక్షగానము] తొలిపలుకు. పుట. xv

ఆంధ్రదేశమున గుంటూరు గోదావరి మండలములందు 'జక్కులజాతి' వారు కానవచ్చుచున్నారు.

'జక్కులు-జక్కిణి' శబ్దములు జాతిపరముగా నన్వయించుటకు తగిన ప్రమాణములను జూపించుచు ఆచార్య యస్వీ జోగారావు గారువ్రాసినయంశముల నిచ్చట పొందుపఱచుచున్నాను:

"వీరిగుఱించిని ఇ. థర్స్టన్ E. Thurston వ్రాసిన 'Casts and Tribes of South India' అను గ్రంథము ద్వితీయభాగము 438వ పుటలో నిట్లున్నది.

'Jakkula-Discribed as an inferior Caste of prostitutes, mostly of Balija Caste; and as wizards and a dancing and theatrical caste. At Tenali in Kristna District, it was customary for each family to give up one girl for prostitution' etc.,

దీనినిబట్టి జక్కులవారికి నాట్యకళతో సంబంధ ముండినట్లు విశదమగుచున్నది. కళావంతు లనిపించుకొను వారియెడ నట్టి సంబంధము సహజము, వారికొలము బిరుదు సార్థకము. మార్వారు గంధర్వుల సామ్యమున నీజక్కులవారు తొల్లిమత ప్రచారనిమిత్తముననో లేక యక్షియొక ప్రధానవృత్తిగా నవలంబించియో యక్షగానప్రవర్తకులైన వారెల్లఁ గాలక్రమమునఁగలిసి యేర్పడినజాతియనియు, వారి వృత్తికి సంబంధించిన యక్ష (జక్క) శబ్దము తరువాతివారికి జాతివాచకముగాఁ బరిణమించియుండు ననియు నూహింపవచ్చును".

"ఆంధ్రదేశమున జక్కులవారి ప్రశస్తి చిరకాలానుగతముగా వినవచ్చుచున్నది. ఈనాఁడు రాయలసీమలో నున్న జక్కసానికుంట్ల (కర్నూలుజిల్లా, పత్తికొండ తాలూకా), జక్కుల చెఱువు (గుత్తితాలూకా), జక్కుల చెఱువు (పెనుగొండ తా) జక్కసముద్రము (హిందూపురం తా.) జక్కులాడికి (బళ్లారి జిల్లా) మొదలగు గ్రామనామములు ప్రాచీనకాలమున నాయాప్రాంతము నందలి జక్కులజాతిప్రాచుర్యమును సూచించును. అందు కొన్ని గ్రామము లొకప్పుడు వారి కీనాములుగా నీయఁబడినట్లు స్థానికమైన ప్రతీతి కలదు. క్రీ. శ. తే. 9-6-1431 న జక్కుల కన్నాయి యనునామె తిరుమల దేవస్థాన

మున వేయించిన శాసన మొకటి కలదు.[5] అది క్రీ. శ. 15 వ శతాబ్దినాఁటి జక్కులవారి ప్రాభవమును సూచించును''.

"వివిధ జాతుల యుత్పత్తుల గుఱించి యైతిహ్యము లనేకము చిత్ర చిత్రములుగా విశ్రుతము లగుచుండును. అట్లే యీ జక్కులవా రసలు యక్ష స్వరూపులే యైన ట్లొక గాథ కలదు. క్రీడాభిరామమున 'కామవల్లీ మహాలక్ష్మి కైటభారి, వలపు వాడుచు వచ్చె జక్కుల పురంధ్రి' యని యున్నది, దానికిఁ గామెపల్లివారి వీథిభాగవతములోని లక్ష్మీనారాయణుల ప్రణయ ఘట్టమును బాడుచు వచ్చినది జక్కులపురంధ్రి యని కొంద అపవ్యాఖ్యానము గావించిరి. ఆ కామవల్లియే కామేశ్వరిపాట'యను స్త్రీలపాటలోని కామేశ్వరి యని యాకామేశ్వరి కథను కీ.శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు క్రీడాభిరామ పీఠికలో వివరించి యున్నారు. ఈ కథలో మహాలక్ష్మి శాపవశమునఁ బార్వతికి సద్యోగర్భమున సప్తకన్యకలుగా నుద్భవించిన దని యున్నది. అం దొకతెపేరు 'జక్కులమ్మ' యఁట. కామవల్లి కడగొట్టుది...ఆ సప్తకన్యలనే 'అక్కలు' లేక 'అక్కదేవత' లందురు......క్రీడాభిరామమునఁ గామవల్లి వలపు వాడుచు వచ్చిన జక్కుల పురంధ్రి ప్రశంస వెంట 'అక్కల' కొలువు వర్ణింపఁబడినది. ఒక గృహస్థు సంతానార్థియై వారి నారాధించినట్లును, నాసందర్భమున అక్క లేడుగురును లేచి యాడిరనియు, నాయక్కలే 'యక్షకన్య' లనియు (అనఁగా నీఁట జక్కుల పడుచు లనియు) జెప్పఁ బడినది. యక్షశబ్దమునకు- 'జక్క' 'ఎక్క' అను రూపాంతరములే గాక 'అక్క' యను రూపవికృతియు నంగీకార్యమే యనియు, నది భాషాశాస్త్రసమ్మతమే యనియు ఆచార్య శ్రీ గంటి జోగి సోమయాజిగా రనుచున్నారు.".[6]

**యక్షగానము :**

జక్కులపాట యను సమాసమే సంస్కృతీకరింపఁబడి యక్షగాన మయ్యె నని కీ. శే. పంచాగ్నుల ఆదినారయణ శాస్త్రిగారి వాదము. విమర్శకులు దీనిని పూర్తిగా నంగీకరించుట లేదు. యక్షగానమను పదమే ముం దేర్పడి యది

---

5. తిరుపతి దేవస్థాన శాసనములు. ద్వితీయసంపుటము. నం. 77.

6. ఆంధ్ర యక్షగానవాఙ్మయచరిత్ర. ప్ర. భా. పు. 17-18; 22-24.

'జక్కులపాట'గాఁబరిణమించిన దని పేర్కొనుచు శిష్టవ్యవహారమున'యక్షగాన' మనియు, జనసామాన్య వ్యవహారమున 'జక్కులపాట' మొదలగు రూపము లందును ప్రచరిత మయ్యె నని భావించుచున్నారు.

శ్రీనాథుఁడు భీమఖండమున 'కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగానసరణి' యని'యక్షగాన'శబ్దమును వాడియదియొకగానసరణియని సూచించినాఁడు. 'యక్షోఘ గీత మపి గానశైలీమ్' అని సంగీతసుధ యక్షగాన మొక గాలశైలి యని పేర్కొనినది. ఆంజనేయకృత మగు నొక ప్రాచీన లక్షణ గ్రంథమున యక్షగానశైలి ప్రశంస కల దని యందురు కాని ప్రస్తుత మాగ్రంథము లభించుట లేదు. అట్లగుటచే యక్షగాన సరణిని గాని శైలినిగాని గుర్తించుటకు మనకు వీలుపడుట లేదు. ఈ నడుమ కళాప్రపూర్ణ శ్రీవడ్లమూడి గోపాలకృష్ణయ్య గారు 'యక్షప్రియ' రాగ పరమైన రచనయే క్రమముగా యక్షగాన మయ్యె నని వ్రాసియున్నారు.[7] అంతేకాక 'అసలు యక్షగాన మంటే యక్షుల గురించి చేసే గానం, యక్షులు చేసే గానం, యక్షులు గానం చేసినట్లు చేయబడే గానం అని అర్థాలు. యక్షులు చేసే గానం యేదైనా కావచ్చు. వారి ననుకరించి చేసేది యేదైనా కావచ్చు. యక్షుల గురించి చేసేది అంటే యక్షులప్రీతికై చేసే గానం కావచ్చు. కేవలం యక్షుల గాథలే గానం చేసేదీ కావచ్చు. యక్షుల ప్రీతికి యక్షులగాథలే కాక యితర గాథలూ వారి కిష్టమైనవి గానం చెయ్యవచ్చును. ఈ దృష్ట్యా గాన యోగ్యమైన ప్రబంధం యేదైనా సరే కావ్య మేదైనా సరే 'యక్షగాన' మనడానికి సమర్థమైన దన్నమాట' అని యక్షగాన శబ్దార్థాలను విస్తరించి నిరూపించినారు.

'యక్షగాన శబ్దార్థమునుగూర్చి శ్రీ యం. గోవిందరావు గారు తమ వ్యాసమున లడ్విగ్, గెల్డ్నర్ అను పాశ్చాత్య పండితు లిరువురు యక్ష శబ్దమునకు 'ఉత్సవము (Festivity) అను నర్థము చెప్పినా రనియు, నది గాని యంగీకార్య మగుచో యక్షగాన మనఁగా నొక యుత్సవ సమయమునఁ జేయఁ బడు సంగీతగోష్ఠి యని చెప్పవచ్చునని యన్నా' రని ఆచార్య యస్వీ జోగారావుగారు పేర్కొని యుండిరి.

యక్షగానము స్వభావముచే గాన ప్రధాన మయ్యును, స్వరూపముచే రూపక ప్రక్రియా విశిష్టమై తెలుఁగు సాహిత్యమున గానవచ్చు చున్నది గాన

7. సీతాకల్యాణము [యక్షగానము] తొలిపలుకు పుట viii & xviii.

ంభమై నృత్యాభినయ విశిష్టముగాఁ బెంపుఁగాంచిన దేశిరూపకరచనా ప్రక్రియ యక్షగానము.

యక్షగాన ప్రసక్తి :

బ్రాహ్మణ బౌద్ధ జైన సారస్వతములందుఁ గానవచ్చు యక్షుల గాన మెట్టిదో మనకుఁ దెలియరాదు. బౌద్ధులు జైనులు మతప్రశస్తిని జాటు కథలను గాథలను బాకృతాది భాషలలో గీతములుగనో రూపకములుగనో యక్షపాత్రల చేతఁ బాడించి యుండవచ్చును. కాని, యట్టివి మనకిప్పు డలభ్యములు. కన్నడ విమర్శకులు కొందఱు 'బెదండె' 'చత్తాణ'ము లనెడి కావ్య భేదములు, యక్షగాన సదృశములనియు క్రీ.శ. 9 శతాబ్దినాటి కేఅవికానవచ్చుచున్నవనియు పేర్కొనినను వానికి లక్ష్యములైన గ్రంథములు దొరుకుట లేదు. కవిరాజమార్గలక్షణాను సారము వాని స్వరూపములను భావించినచో నవి యక్షగానముల వంటి వనుటకు లు లేకున్నది.

క్రీ.శ. 12 వ శతాబ్దమున కన్నడ సాహిత్యమున వెలసిన చంద్రప్రభా పురాణమునందును, మల్లినాథ పురాణమునందును 'ఎక్కలగాణ' ల ప్రసక్తి వినవచ్చుచున్నది. అగ్గళుడు రచించిన చంద్రప్రభా పురాణమునందు వన విహారము చేయుచున్న నాయకుఁడు మేళతాళములతో నిమిత్తములేకయే దేశీయ గీతము నొక 'ఎక్కలగాణ' యింపుగాఁ బాడుచుండ వినుచుండె నని వర్ణింపఁ బడినది. అభినవపంపని మల్లినాథ పురాణములో కమలామోది యైన తుమ్మెద ఝుంకారము కమలాలయ యైన లక్ష్మిని గీర్తించుచు పాడెడు 'ఎక్కల' గాన ముతోఁ బోల్చి వర్ణింపఁబడినది. ఆ పురాణమునందే 'యక్షాందోళన' మను యక్షిణి నాట్యము ప్రస్తావింపఁ బడినది. ఆ యాందోళికా నృత్యమును గూర్చి వివరించుచు శ్రీముట్నూరి సంగమేశముగా రిట్లు వ్రాసిరి: "కన్నడ యక్షగా నాల్లో నటివేషాన్ని యక్షిణీవేషమనీ, శ్రీవేష మనీ, మోహినీవేష మనీ పరి పరివిధాల పిలుస్తారు. ఈమె మొదటిసారి రంగస్థలానికి వచ్చినప్పుడు నడుము వరకు అట్టతో కట్టిన ఒక తొట్టెవంటి చౌకంలో నిల్చి నృత్తగతులు ప్రదర్శి స్తుంది. ఈ నృత్తాన్ని ఆందోళికానృత్య మనీ మంచెచప్పరనృత్య మనీ పిలు స్తారు". ఇట్టి యక్షాందోళన నాట్యమునకును ప్రాథమికాంధ్ర యక్షగానమునకును

గొంత సంబంధ బాంధవ్య ముండి యుండవచ్చు నని విమర్శకులు భావించు చున్నారు.

ఆంధ్రసాహిత్యమున 'యక్షగాన' ప్రశస్తి స్పష్టముగా వినవచ్చినది శ్రీనాథుని భీమఖండముననే.

'కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి" (భీమ. ఖ. 3.65)

అది క్రీ. శ 1430 ప్రాంతము. అంతకుఁబూర్వము పాల్కురికి సోమనాథుని (క్రీ. శ. 1280-1340) పండితారాధ్య చరిత్రమున యక్షపాత్రల నేపథ్యముల తోడ యాటపాటల ప్రసక్తి కానవచ్చుచున్నది. అందలి పర్వతప్రకరణమున శివరాత్రిజాగరమునఁ బ్రవర్తిల్లెడి బహువిధములైన వినోదములను వివరించుచు

'ఆదట గంధర్వ యక్షవిద్యాధ
రాదులై పాడెడు నాడెడు వారు (రి?)
విధమునఁ బ్రచ్ఛన్నవేషముల్ దాల్చి
యధికోత్సవము దులుకాడునట్లు"

కొంద రాడెడివారని వర్ణించెను. దీనివలన గంధర్వ యక్షాదుల వేషములను ధరించి పాడుచుండెడివారివలెఁబ్రచ్ఛన్నవేషములను దాల్చి రూపక విశేషము లను బ్రదర్శించెడి యాచార మొకటి యప్పటికే ప్రసిద్ధమై యున్న దని స్పష్ట మగుచున్నది. బౌద్ధ జైనమతప్రచార సాహిత్యములం దట్టి యక్షపాత్రలు ధరించి యాడెడివా రుండి యుండవచ్చును; లేక జక్కులజాతివంటివారు ప్రద ర్శించు యక్షగానములు వెలసియుండి యుండవచ్చును. వారి ననుసరించుచు నాడినయాట లిందు ప్రసక్తములై యున్నవి. వానితోపాటు నాటకములు బహురూపములు, వెడ్డంగము, తోలుబొమ్మలాటలుమొదలగురూపకప్రకియలును తెరలు, వేషధారణ విశేషములు, సంగీతపుహంగులు, అభినయభంగులు మొద లగు నెన్నియో విశేషములును వర్ణింపఁబడినవి. అనగా నన్ని రూపకప్రక్రియల యందును యక్షాదిరూపధారణములతోఁ బాడుచుండెడు రూపకప్రక్రియయు నొకటి ప్రసిద్ధమని స్పష్టమగుచున్నది. అట్టిది నేటి యక్షగానప్రక్రియకు మూలకందమై యుండుననుటలో విప్రతిపత్తి లేదు ఆ ప్రక్రియ కట్టి ప్రసిద్ధి

ప్రచారములు రావలయునన్నచో నాకాలమునఁ గనీస మెకరెండు శతాబ్దులకుఁ బూర్వమే యది యుత్పత్తియై యుండవచ్చును. కావున యక్షగానముల ప్రాథమిక స్వరూపము తెలుగున క్రీ. శ. 1000 సం॥ నాఁటికే వెలసియుండెనని యూహించుటకు వీలగుచున్నది.

కాని, యప్పటినుండియు శ్రీనాథుని కాలము వఱకు గల మధ్యకాలమున నెట్టి యక్షగానములు రచింపఁబడినట్లు కానరాదు. ఒకవేళ రచింపఁబడియున్నను నేఁడు మనకు లభ్యమగుటలేదు. శ్రీనాథుని క్రీడాభిరామము వీథి యను రూపక విశేషము. అది ప్రేమాభిరామమున కనువాదము. అందు జక్కులపురంధ్రి పాటపాడుట వర్ణింపఁబడినది.

సీ. కోణాగ్ర సంఘర్ష ఘుమఘుమధ్వనితార
కంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టు బోనాన నసలు కొల్పిన కన్ను
కొడుపుచేఁ దాటించు నెడప దడప
శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగ వలయుచోఁ
జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ
గిల్కుగిల్కన మ్రోయు కింకిణీగుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప

రాగముననుండి లభించు రాగమునకు
నురుమ యూరుద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపు వాడుచు వచ్చె జక్కుల పురంధ్రి. క్రీ. రా. 135

దీనితోపాటు 'అక్కల' (యక్షకన్యల) చూటయునందు వర్ణింపఁబడియున్నది దీనిని గమనించినచోఁ బాల్కురికి సోమనాథుని కాలమునకుఁ బూర్వమే పాత్రలచే నాట పాటల రూపమునఁ బ్రయోగింపఁబడు యక్షగానప్రక్రియ జక్కులవారిచేఁ బరిపోషింపఁబడుచుండె ననియు, నదియే కాలక్రమమున నాజాతివారలలో నొక విశిష్టగానసరణిగా, నేకపాత్రముచే శ్రుతితాళరాగసమన్వితమై, వాద్యోపకరణ సహితమై, కథాఖ్యానయుతమై నృత్యానుకూలముగా ప్రయోగించు నాట్యప్రక్రియగా విస్తరించె ననియు స్పష్టమగుచున్నది.

క్రీ. శ. 1537 ప్రాంతమున తాళ్లపాక చినతిరుమలాచార్యులు తన తాత యగు తాళ్లపాక అన్నమాచార్యుని (క్రీ. శ. 1408-1503) సంగీతలక్షణము నాంధ్రీకరించుచు దరువులు, జక్కులరేకులు[8]ఏలలు చందమామపదములు మొదలగువాని నెఱిఁగించి యావరుసలోనే

"యక్షగానపదంబులు నవ్విధమున
సముచితానేకవిధ తాళ సంగతులును
నవరసాలంక్రియా సవర్ణంబు లగుచు
నలరు నని హరికీర్తనాచార్యుఁ డనియె' సం.ల. 66 ప.

అని యక్షగాన పదమును నిర్వచించెను. పైఁ బేర్కొనిన జక్కులరేకు పదముల లక్షణము లెఱిఁగింపక యక్షగాన పదముల నిర్వచనమొనరించుటచే నారెండును స్వరూపస్వభావములందు సమానము లని యూహింప వీలగుచున్నది. దీనిని బట్టి క్రీ. శ. 15వ శతాబ్దినాటికి యక్షగానమున కథయు, వివిధ తాళసంగతులు, నవరసాలంక్రియాసవర్ణములు, చేరి దానికి కావ్యస్వరూపసంపత్తిని సంఘటించిన వని తెలియుచున్నది.

యక్షగానములు మొదట సంగీత సంకీర్తనల రూపమున ప్రారంభమై కథాకథన ప్రబంధ రూపములుగా పదునేనవ శతాబ్దమునాటికే పరిణామము చెందె నని పైఁబరిశీలనమువలన గమనింపవచ్చును.

ప్రథమాంధ్ర యక్షగానము:-

తెలుఁగున నుపలభ్యమానములగుచున్న యక్షగానములలో కందుకూరి రుద్రకవి విరచితమైన సుగ్రీవవిజయము ప్రప్రథమ యక్షగాన మని పండితులు భావించుచుండిరి.కాని,తెలుఁగున నిప్పటికి దొరకుచున్న యక్షగాన వాఙ్మయమును బరిశీలించిక్రీ. శ. 15వ శతాబ్ది యుత్తరార్ధమున నుండిన ప్రోలుగంటి చెన్నశౌరి రచించిన'సౌరభిచరిత' మనుజక్కులకథయే ప్రప్రథమయక్షగానమనియు,క్రీ.శ. 1500 ప్రాంతమున నున్న వెల్లంకి తాతంభట్టు కవిచింతామణియం దుదాహరిం

8. గౌరనకవి [క్రీ శ, 1380-1440] రచించిన లక్షణదీపికలో జక్కులరేకుపదములు మధురకవితలలోఁ జేరునని తెల్పియుండెను.

చిన 'లక్ష్మీకల్యాణమురేకు' లకు నాకరమైన యక్షగానము రెండవది యనియు చక్రపురి రాఘవాచార్యుఁడను కవి 16వ శతాబ్దమున రచించిన విప్రనారాయణ చరిత్రము మూఁడవదియనియు, కందుకూరి రుద్రకవి విరచితమైన 'సుగ్రీవ విజయము' నాల్గవది యనియు డా॥ యస్వీ జోగారావుగారు తమ సిద్ధాంత వ్యాసమునఁ బేర్కొనియుండిరి. అందు మొదటి రెండును లభించుటలేదు. విప్రనారాయణ చరిత్ర మదరాసు ప్రాచ్యలిఖిత భాండాగారమునఁ గలదు. సుగ్రీవ విజయము ప్రకటితము.

**యక్షగాన లక్షణము :**

పదునైదవ శతాబ్ది యుత్తరార్ధమున వెలువడిన యక్షగానములు కొన్ని మనకు లభించుటనుబట్టి యంతకుఁ బూర్వము యక్షగాన రచన సాగియుండ లేదని భావించుట పొరపాటు. పదునేనవ శతాబ్ది పూర్వార్ధమున వెలసిన తాళ్ళపాక అన్నమాచార్యుని సంకీర్తన లక్షణమునఁ బేర్కొనఁబడిన 'యక్షగాన పదము'ల ప్రశంస అందుకు సాక్ష్యము. క్రీ. శ. 1385-1445 సం॥ల నడుమ నున్న గౌరన మహాకవి తన లక్షణ దీపికయందు మధుర కవిత్వ స్వరూపము నెఱిఁగించుచు "యక్షగానంబున వెలయు పదంబులు, దరువులు, నేలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, నుయ్యాలజోలలు, జక్కులరేకుపదంబులు, చందమామ సుద్దులు, అష్టకంబులు, ఏకపద ద్విపద చతుష్పదాష్టపదులు నివియాదిగాఁ గల్గు" నన్నింటిని బేర్కొని యుండుటను బట్టియు, నవి యన్నియు యక్షగానములందుఁ గానఁబడుచుండుటనుబట్టియు పదునాల్గవ శతాబ్దినాఁటికే యక్షగాన రచనము పరిపక్వదశ నంది లక్ష్యము లెన్నియో వెలసియున్నట్లు భావింప వీలగుచున్నది. కాని, మన దురదృష్ట వశమున నట్టి దేశిసాహిత్యభాండారము మనకు కనుమఱుగై పోయినది.

పదునాఱవ శతాబ్ది తరువాత వెలసిన లక్షణగ్రంథములందు యక్షగాన లక్షణములు మనకు స్పష్టముగాఁ గానవచ్చుచున్నవి. ఉదాహరణమునకు — పదునాఱవ శతాబ్దిపూర్వార్ధమున నున్న చిత్రకవి పెద్దన తన లక్షణ సార సంగ్రహమున నిట్లు పేర్కొనెను:

సీ. "వృషభగతి త్రిపుట రే కం(ఘ్రియుగ మగుఁ
దుద నేఁడు లఘువులు తొలఁగఁజేయ,
జంపెరేకునకు లక్షణము ద్విరదగతి
యగుఁగొన నొక లఘు వందు మాన,
రచ్చరే కగును దురగవల్గనము గతి,
మఱి యేకతాళియౌ మధురగతిని
అటతాళమున మాత్ర లంఘ్రి కిర్వదినాల్గు
నాల్గిట విరతి పద్నాలు గింట

తే. నిలుచు నర్ధంపు నర్ధచంద్రికలు దీన
యక్షగానాది కృతులతో నార్యు లిడిన
రగడభేదంబు లవి యౌను రమ్యచర్య
యవిత నిజవాససముదాయ ! యాంజనేయ !" (2.141)

ఇందు పెద్దన త్రిపుటరేకు, జంపెరేకు, రచ్చరేకు, అర్ధచంద్రికల తాళగతులకు రగడగతులకు గల సామ్యభేదములను తెలియపఱచెను. ఇట్టి విధానమునే యనుసరించి యక్షగానమునం దుండెడి రగడభేదముల నప్పకవి క్రీ. శ. 1650 ప్రాంతమున బేర్కొనెను.

సీ. "తుద నేడు లఘువులు తొలగించి చదివినఁ
ద్రిపుటకు వృషభగతిపదయుగము,
లలిఁ గడపల నొక్క లఘు మానిన జంపె
మను ద్విరదగతి సమపదయుగము
గురుతగు రచ్చరేకుఁ దురగవల్గనా
హ్వయ మేకతాళి యామధురగతికి
నంఘ్రి కిర్వదినాలు గటతాళమున మాత్ర
లోలి విశ్రాంతి పద్నాలుగింటఁ

తే. దెలియ నర్ధంబు నర్ధచంద్రికలు వీన
యక్షగానప్రబంధంబు లతుకవచ్చు
రగడభేదంబు లివి యంద్రు రసఁ గవీంద్రు
లవితనిజసేవకస్తోమ! యబ్ధిధామ ! (4.303)

యక్షగానములందలి రగడభేదములు త్రిపుటాదితాళముల కనువుగా రచింపఁబడుచున్నట్లు తెలియుచున్నవి కాని వాని పేర్లు తెలియుటలేదు. పెద్దనయు, నప్పకవియు యక్షగానమునందలి రగడభేదములైన ఛందములను మాత్రమే పేర్కొనియుండిరి కాని వానియం దుపయోగింపఁబడుచున్న వివిధదేశిచ్ఛందముల వివరముల నెఱిఁగింపలేదు. గౌరన లక్షణదీపిక యందలి కొన్ని కానఁబడుచున్నవి. విజయరాఘవుని యాస్థానమున నున్న చెంగల్వకాళ కవి రాజగోపాల విలాసావతారికలోఁ బేర్కొనఁబడిన

"యక్షగానంబు రావణహస్త ముడుకు
దండె మీటులు చెంగులు తాళములును
జోల సువ్వాల ధవళంబు లేల లమర
కొంద ఱతివలు వినిపించి రందముగను. 1.24

అను పద్యము ననుసరించి యందలి ఛందోవిశేషములు తెలియుచున్నవి. ఈ యుగమునందే యున్న గణ పరపు వేంకటకవి తన లక్షణ శిరోమణిలో నిట్లు పేర్కొనినాఁడు.

"......యక్షగానంబునకును
పద్యగద్యంబులు బహువిధతాళముల్
రేకులు గూర్ప వర్తిల్లు."

లాక్షణికులుగాని, కవులుగా యక్షగానముయొక్క సమగ్రస్వరూపమును నిర్వచించినట్లు కానరాదు. యక్షగానములపైఁ బరిశోధన గావించిన ఆచార్య యస్వీ జోగారావు గారు సాహిత్యప్రక్రియగా యక్షగానము నిట్లు నిర్వచించియుండిరి.

"యక్షగానమునం దితివృత్త మెట్టిదైన గావచ్చును. రచనాప్రక్రియ శ్రవ్యముగాని, దృశ్యముగాని కావచ్చును. ఏప్రక్రియయందైన గీతిధర్మము విహితము. అందు రాగతాళములలో నొకదానికిఁగాని రెండింటికిఁగాని తగు ప్రాధాన్యము గల రచనావిశేషములు (రేకు, దరువు, పదము. కీర్తనమొ॥), ద్విపద(మంజరియును), పద్యములు (జాత్యుపజాతి వృత్తము, అర్ధపద్యములు ,సంస్కృత శ్లోకములును), వచనము (సంధి ప్రయోజననాత్మకముగాని, సంవాదాత్మకముగాని, వర్ణనాత్మకమైనను గాఁదగును, చూర్ణికలు, విన్నపములుమొ॥ గద్య ప్రభేదములు) నుండఁదగును. ఏలాదిగీత ప్రబంధవిశేషముల ప్రయోగ మైచ్ఛికము."

'మంగళారంభాని మంగ మధ్యాని మంగళాంతాని ప్రథన్తే, యను సంప్రదాయము ననుసరించి యక్షగానములు భగవస్తుతితో నారంభమగును. తరువాత వినాయకస్తుతి, పూర్వకవిస్తుతి, కుకవినింద, కృతిభర్తృవర్ణనము, షష్ఠ్యంతములు, ప్రవర్తింపఁబడి యక్షగాన కథారంభము చేయఁబడును. ఇట్టి పూర్వరంగము శ్రవ్యకావ్యోచితమయ్యు దృశ్యప్రక్రియ నాశ్రయించి గానముచేయఁ బడుచుండును సంస్కృత నాటకములందువలె సూత్రధార ప్రవేశము కానరాదు! కాని హంగుదారుల ఘోషాళింపు వాద్యగానములమేళవింపు గానవచ్చుచున్నది. ప్రాథమిక యక్షగానములందు నటియే రంగమున నృత్యము చేయుచు నాయాగీతముల నాలపించుచుండినట్లును, వంతదారులు సంధివచనము లాలపించుచు నట్లును దెలియవచ్చుచున్నది. వేషరచనము, తెర లుపయోగించుట రూపకప్రయోగానుగుణ్యమును సూచించుచున్నది. పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలోఁ దెరలోనుండి వెలువడి నాట్యమొనర్చెడి నటిని వర్ణించిన విధముగాంచుడు

"శిరమున నురమున జెవులకంఠమున
గరముల గూకటిగాళ్లఁ జెల్వార
గవదండలును గనుగవ గదలికలు
సవరంబులును గళంబు దండలును
భసింతబు బూతపైఁబరగు బచ్చెనలు
నలరారు చిఱుగజ్జియలును నందియలు
సరిరత్నపంక్తుల జలపోషణములు
గర మొప్ప తొంగళ్ల గల చల్లడములు
బొల్చు దంతావళుల్ బుష్పమాలికలు
దాల్చి యత్యద్భుతోత్సవ లీలఁ దనర
జనులు హర్షింప నాస్థానముల్ సొచ్చి
యనుకూల వివిధవాద్యసమ్మేళనమును
నార్భటం బిచ్చి యొయ్యన జవనికల
గర్భంబు వెడలి యక్కజము వట్టిల్ల..."

రంగస్థలమునకు నలువైపుల నుండు ప్రేక్షకులకుఁ బ్రదర్శనము కనఁబడునట్లుగా ప్రయోగము నిర్వహింపఁబడెడిది.

కాలక్రమమున నొకేపాత్ర యాడుచుఁబాడుచు కథను వినిపించు ప్రక్రియ తగ్గుమొగము పట్టి యొక్కొకపాత్ర యొక్కొకనటుడు ధరించి ప్రయోగించు ప్రక్రియ వాప్తికెక్కినది. అట్టియక్షగానములకు యక్షగాన నాటకములనియు, వీధినాటకము లనియు, బయలాట లనియు పేళ్ళువచ్చినవి. ఇట్టి పరిణామము తంజావూరు నాయక రాజుల కాలమునందు ప్రసిద్ధికెక్కినది. విజయరాఘవ నాయకుఁడు యక్షగానమును నాటకముగాఁ బేర్కొనినాఁడు. దైవస్తుతి షష్ఠ్యంత ములకు బదులుకై వారమును నటీసూత్రధారులను బ్రవేశపెట్టినాఁడు. రగడలు, త్రిపుటలు మొదలైన వానికంటె పదములు, దరువులు, జతులు మొదలైన వానిని విరివిగాఁజొప్పించినాఁడు. ఆకాలమున యక్షగానములలో పాత్రలసంఖ్యతో పాటు నాటకీయత పెంపొందినది. పురాణేతిహాసపురుషుల జీవితాలనే కాక సమకాలీన మహాపురుషుల జీవితగాథలు యక్షగానములలో వస్తువులుగాఁ గైకొనఁబడినవి.

యక్షగాన ప్రక్రియతో సన్నిహిత సంబంధము పెంచుకొని వెలువడినవి కలాపము, బుఱ్ఱకథ, హరికథ, వీధినాటకము, కూచిపూడి భాగవతములు, మొదలగు దేశిరూపక ప్రక్రియలు. ఇటీవలి వీథినాటకములలో సమకాలీన రాజకీయములకు సంబంధించిన యితివృత్తములును గ్రహింపఁబడినవి. తెలుఁగున నాటకరచన మభివృద్ధి చెందుటచే యక్షగాన రచనాప్రక్రియ వెనుకంజ వేసినను, అంతంరించి మాత్రము పోలేదు.

## కొఱవంజి — యక్షగానము :

కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ద్రావిడ భాషలలో వెలసిన కుర వంజు లనఁబడు దేశీయ దృశ్యరచనలే గేయవిశిష్ట నాట్యరచనలై పల్లెలందు జక్కుల వారిచేఁ బ్రదర్శింపఁ బడుచు, క్రమముగా నగరముల కెగఁబ్రాకి యక్షగానము లనఁబడె నని భావించిరి. ఈ వాదమును విమర్శించి ఆచార్య యస్వీ జోగారావు గారు కొఱవంజి దృశ్యరచనల కంటె యక్షగానములు ప్రాచీనములుగాఁ గనుపట్టుచున్న వనియు, వానియందు కొన్ని సాదృశ్యములు గనఁబడుచున్నను వానిమధ్య జన్య జనక సంబంధము కానరా దనియు, సమాంతరముగాఁ బెరిగిన సాహిత్య ప్రక్రియ లనియుఁ బ్రతిపాదించిరి.

**బొమ్మలాట - యక్షగానము—**

బొమ్మలాట నుండి యక్షగానము జనించిన దని శ్రీనేలటూరి వెంకట రమణయ్య గారి వాదము. దానిని విమర్శించి ఆచార్య యస్వీ జోగారావుగారు 'బొమ్మలాట—యక్షగానములయొక్క నైసర్గిక స్వరూపమును బరిశీలించినచో నారెండింటికిని గాఢమైన యనుబంధము కల దనిపించును. అయితే అది యనుబంధము మాత్రమే. జన్యజనక భావసంబంధము కాద'ని నిశ్చయించిరి.

యక్షగానము దేశిసంప్రదాయమున జనించిన రూపక ప్రక్రియ యని పలువురు విమర్శకులు భావించు చున్నారు. కాని, యది సంస్కృతోపరూపక జన్య మని భావించెడి వారును గలరు. యక్షగానముల యుత్పత్తి పరిణామ వికాసములను బరిశీలించినచో మొదట దేశియై జనించిన యక్షగానము పరిణామమున మార్గలక్షణములను దనయందు లీన మొనర్చుకొని విస్తరించినదని స్పష్టముకాఁగలదు.

**యక్షగాన విభాగము :**

ఆచార్య యస్వీ జోగారావు గారు యక్షగానములను ప్రయోజన ప్రాధాన్యమును బట్టియు, నితివృత్త వైవిధ్యమును బట్టియు నీ విధముగా విభజించినారు. ప్రయోజన ప్రాధాన్యమును బట్టి యక్షగానములు శ్రవ్యము లనియు, దృశ్యము లనియు, ఉభయ ప్రయోజనాత్మకము లనియు మూఁడు విధములు. అందు శ్రవ్యములలోఁ ప్రబంధములవలె పఠనమునకు మాత్రమే పనికి వచ్చునవి యనియు, హరికథలవలె జంగంకథలవలె కథాఖ్యానమునకుఁ బనికి వచ్చునవి యనియు రెండు తెఱఁగులు కాననగును. దృశ్యములను వీథినాటకములు, బొమ్మలాటలు, మార్గనాటకములు, ఆధునిక నాటకముల విధానము ననుసరించినవిగాఁ జతుర్విధమున విభజింపవచ్చును.

ఇతివృత్త వైవిధ్యమును బట్టి పౌరాణికము లనియు, స్థలపురాణములు—లేక—క్షేత్ర మాహాత్మ్యము లనియు, చారిత్రకములనియు, మహాపురుషులచరిత లనియు, తాత్కాలికేతివృత్తములు గలవనియు, సాంఘికేతివృత్తము లనియు, జానపదగాథ లనియు, కల్యాణకథ లనియు, తత్త్వవిషయికము లనియు, విలాస చరిత్ర విజయాది నామములతోఁ గనవచ్చు నితరము లనియు విభజింప వచ్చును.

యక్షగానముల వైశిష్ట్యము నుగ్గడించుచు డా॥ యస్వీ జోగారావుగారు అవి సర్వోపభోగ్యములైన సమాహార కళా స్వరూపము లనియు, వివిధ ప్రక్రియానుబంధము లనియు, బహువిధ పదకవితా ప్రభేద సమీకరణము లనియు, వస్తు వైవిధ్య శోభితము లనియు, శృంగార వీర కరుణ హాస్య రసప్రధానము లనియు, ఛందో వైవిధ్యమునకును, భాషా వైవిధ్యమునకును, లోకవృత్త ప్రదర్శనమునకును నాకరము లనియు, బేర్కొనిరి. యక్షగానము యొక్క దేశిక నాటకకళా ప్రాతినిధ్యమునుగూర్చి వారు నుడివిన మాట లిచ్చట సంస్మరణీయములు :

"దేశివాఙ్మయ మంతయు మధురకవితా శాఖకుఁ జెందిన గీతప్రబంధముల ప్రాచుర్యము గలది కావున నట్టి గీత ప్రబంధముల కెన్నిటికో యక్షగానమాకర మగుటచేత యక్షగానమును దేశివాఙ్మయకోశమంతటికినిఁ బ్రతినిధి యనఁ జెల్లును. కాని, యక్షగాన మనఁగా నీనాఁడు గాన ప్రక్రియగాఁ గాక రూపకప్రక్రియగాఁ బరిగణింపఁ బడుచున్నది. అయితే యక్షగానమునకు ముందే దేశమున వీథినాటకములు ప్రచారమునం దుండినను, అది యా వీథి నాటకములతో నేకమై నాటకప్రక్రియగా రూపొంది, నాటక శబ్ద వాచ్యమునై మధ్యలో మార్గనాటకప్రభావము సోకినను దన వ్యక్తిత్వమును గోల్పోక, కలాపము, కొరవంజి మొదలగునవి దేశీయదృశ్యరచనలుగా రూపొందుటకై తన ప్రక్రియాసత్త్వమును దానము చేసి, బొమ్మలాటలకును వాటమైన వంతపాటగా బరిఢవిల్లియుండుటఁ జేసి, దానిని దేశిసరణికిఁ జెందిన నాట్యకలా ప్రపంచమునకుఁ గూడ తగిన ప్రతినిధి యనుటలో విప్రతిపత్తి యుండరాదు".

## సుగ్రీవవిజయము :

రామాయణకథలోఁ బతాకనాయకుఁడు సుగ్రీవుఁడు. స్వీయకార్యమున సాధించుకొని నాయకునకుఁ గార్యసాధనమునఁ దోడుపడువాఁడు పతాక నాయకుఁడు. ప్రధానేతివృత్తమునకు సమాంతరముగా నడచు పతాకనాయక వృత్తము మహాకావ్యములందు నాతివిస్తృతమయ్యు రసవంతముగ నుండును అట్టి వస్తువు సామాన్యముగా నొకప్రత్యేక లఘుకృతి కితివృత్త పుష్టిని గల్పింప సమర్థమై యుండును. సుగ్రీవుని వృత్తాంత మట్టి కందపుష్టికల కథ రావణుని నోడించిన వాలితో సుగ్రీవునకైన వైరభావము, యుద్ధము వీరర

ప్రధానములు. తారాశోకము కరుణరస ప్రపూరితము. ధర్మసంస్థాపనమునకై రాముఁ డొనరించిన స్నేహకార్యము ధర్మవీర పరిపోషకము. హనుమంతుని నీతి చాతుర్యము కథాసంవిధాన సమర్థము. ఇట్టి స్పృహణీయవస్తు సంపద నిండారిన వస్తువును గ్రహించి యక్షగానముగా రచించిన కవివతంసుఁడు కందుకూరి రుద్రయ.

'కాళికాంబా ప్రసాద సంకలిత కవిత్వ చాతుర్యుఁ'డైన కందుకూరి రుద్ర కవి విశ్వబ్రాహ్మణుఁడు. ఇతని తండ్రి పెదలింగనార్యుడు. ఇతని యింటి పేరునుబట్టి నెల్లూరు మండలమునందలి కందుకూ రితని వాసమై యుండవచ్చును. ఇతఁడు సుగ్రీవ విజయ మను యక్షగానమునే కాక నిరంకుశోపాఖ్యాన మను ప్రబంధమును జనార్దనాష్టకమునుగూడ రచించెను. శ్రీకృష్ణదేవరాయల భువన విజయమున వెలసిన అష్టదిగ్గజమహాకవులలో నీతఁ డొకఁ డనియు, నీతఁడా సభాభవనమున నీశాన్యదిక్కున నధివసించెడి వాఁడనియు, బ్రతీతికలదు. మల్కిభరామని ప్రసిద్ధి గాంచిన ఇబ్రహీంకుతుబ్‌షా రుద్రకవికి ద్వాయతింత్రిణీ జనపదమును దాన మిచ్చినట్లు శాసన ప్రమాణము కలదు. ఆ గ్రామమునే 'రెండు చింతల' యని పిలచెదరు. ఆ గ్రామమున నీకవి వంశీయు లాయగ్రహారము ననుభవించుచుండి రనియు, నావంశమున వారికి 'కవివారు' అను నామ మేర్పడెననియు, రుద్రకవి యాగ్రామమున వసించి యుండెననియు కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తెల్పియున్నారు. రుద్రకవి నిరంకుశోపాఖ్యానము తాళికోటయుద్ధానంతరము వ్రాసియుండు ననుటకుఁ గావ్యప్రమాణములు కలవుకావున నాకవి క్రీ. శ. 1500 నుండి 1580 సం॥ల నడిమి కాలమున నివసించియుండవచ్చు నని విమర్శకులు భావించుచున్నారు. ఇందు కొందరి కభిప్రాయ భేదములున్నను అతఁడు పదునాఱవ శతాబ్ది యుత్తరార్ధము వాఁడను టలో నెట్టి సంశయమును లేదు.

రుద్రకవి కందుకూరి జనార్దన స్వామిభక్తుఁడు. అతని యక్షగాన కృతి నాదేవున కంకిత మిచ్చి కృత్యారంభమునందును, అంతమున ద్విపదయందును ఆస్వామిని కీర్తించెను.

సుగ్రీవ విజయమునందలి వస్తువును బట్టి యది ప్రఖ్యాతము, పౌరాణికము రామాయణమునందలి కిష్కింధకాండమునుండి యీ కావ్యవృత్తము

గై కొనఁబడినది. సహజరస సన్నివేశబంధురమై యుండుటచే రుద్రకవి మూల కథ నెట్టి మార్పులు చేయక తనకావ్యమున నిబంధించుకొనెను.

సుగ్రీవ విజయము మంగళారంభసూచకమైన శ్రీకారము మొదట నిలిచిన యుత్పలమాలా వృత్తముతో నారంభమగును. అదియే నాందీపద్య మనఁదగియున్నది. అందు రుద్రకవి త్రిమూర్తులకును త్రిశక్తులకును, విఘ్నేశ్వరునకును, గురువునకును నమస్కరించి, కావ్యవిద్యావిదులను నుతించి, కవితాజడులైనకుకవులనునిరసించెను.ఆపై నాకవీశ్వరుఁడు, కృతీశ్వరుఁడైన జనార్దన స్వామిని (త్రిపుటలో) నుతించెను. దశావతారసుత్యాత్మకమైనషష్ఠ్యంతములనర్ధచంద్రికలలో నాపై రచించి కథాక్రమమున కుపక్రమించెను. ఈ రచనా విధానము శ్రవ్య కావ్యోచిత రచనాప్రక్రియతో నారంభించు ప్రాచీనాంధ్రయక్షగాన సంప్రదాయమును దెలుపుచున్నది.

కావ్యారంభమువలెనే కథారంభమునుగూడ శ్రీకారముతో నారంభించుట యొక విశేషము. రుద్రకవి కథాకథనమును సంగ్రహముగను సూటిగను సాగించి, రసభావపోషకములైన సంభాషణములను బ్రకరణోచితముగా పస్తరించి రచించుట యతని కావ్యమునఁ గానవచ్చు రచనావిశేషము.

సీతాన్వేషణపరులైన రామలక్ష్మణులు తాపసవేషములం దున్నను శరచాపధరులై యుండుటచే సుగ్రీవుఁడు వారిని గాంచి వాలి పంపున వచ్చినవా రని భయపడును. హనుమంతుఁడు వారి రూపసంపదను వర్ణించి, యట్టి తేజోధనులకు దుష్టగుణము లుండవని వివరించి, వారికడ కేఁగి వారి పూనిక నెఱిఁగి వచ్చెదనని సూచించును. వాలి యందుల కంగీకరించును. హనుమంతుఁడు రామలక్ష్మణుల సన్నిధి కేఁగి, నమస్కరించి, వారి యాగమన కార్యమును గూర్చి ప్రశ్నించును. లక్ష్మణుఁడు తమ వృత్తాంతము నెఱిఁగించి, హనుమంతుని వర్తనమును బ్రశంసించి, యతని వివరములను గూర్చి ప్రశ్నించును. హనుమంతుఁడు సుగ్రీవుని గుణగణముల నుగ్గడించి, తా నతని మంత్రి యనియు, వారికాతని యేలకను బంటు చేయునేర్పు తనకుఁ గలదనియు విన్నవించును. రాముఁనాతని లక్ష్మణుఁడు 'రాముఁడు జగదేకవీరుఁడయ్యును రాజు లొంటిగా రణమున కేఁగుట పాడికాదు కావున సుగ్రీవుని తోడుదీసికొనఁ దలచుచుండె'నని తెలిపెను. హనుమంతుఁడు సుగ్రీవున కడ కేఁగి యతని నందుల కొప్పించి రామలక్ష్మణులతో

నతని కగ్నిసాక్షిగా స్నేహముననుసంధించెను. సుగ్రీవుఁడు సీత ఋష్యమూక పర్వతముపై జారవిడిచిన యాభరణముల మూఁటను రామునకుఁ జూపించెను. రాముఁ డాయాభరణములను గాంచి సీతను స్మరించుచు శోకమూర్తియై విలపించును. కొంతవడికి తేరుకొని రాముఁడు వాలిని సంహరించి కిష్కింధను వాలి కిచ్చెదనని ప్రతినచేసి వాలిసుగ్రీవుల వైరమునకుఁ గారణవృత్తాంతము నాతఁడు చెప్పగా వినును. దుందుభిశవమును గొనఁగోట మీటియు, సప్తతాళములను బడఁగొట్టియు దన పరాక్రమమును బ్రదర్శించి సుగ్రీవునికి ధైర్యము దెప్పించును. సుగ్రీవుఁడు రాముని పరాక్రమమును గీర్తించి శరణు వేడును. రాముఁడు సుగ్రీవుని వాలితో యుద్ధము చేయుటకుఁ బురికొల్పి తాను వృక్షముచాటున నిలిచి బాణ సంధానమునకై వేచియుండును. వాలి సుగ్రీవుల ద్వంద్వయుద్ధమున సుగ్రీవుఁడు వాలిచే నొత్తఁబడును రాముఁడు వారి రూప సాదృశ్యమును గాంచి సుగ్రీవుని గుర్తింపలేక శరసంధానముగావింపడయ్యెను.రాముఁడుఖిన్నుఁడైన సుగ్రీవునకు ధైర్యము చెప్పి, గజపుష్పమాల నాతని మెడలో నలంకరించి మఱల వాలితోఁ బోరుమని పురిగొల్పును తార వల దని వారించినను వినక బలోన్మత్తుఁడైన వాలి సుగ్రీవుని నధిక్షేపించుచు గలిసి పోరునెడ శ్రీరాముఁడు చెట్టుచాటునుండి బాణమును సంధించి వాలిని గూలనేయును.

వాలి రామునివర్తనము నధిక్షేపించును. రాముఁడు తనచర్య ధర్మ బద్ధమేయని సమర్థించుకొనును. మూర్ఛాగతుఁడైన వాలినిగాంచి తార హృదయ విదారకముగా శోకించును. రాము నెత్తిపొడుపు మాటలతో నధిక్షేపించును. సుగ్రీవుని వక్రోక్తులతో నిందించును. వాలి మూర్ఛదెలిసి తమ్ముని జేరఁ బిలిచి, రాజులను మదిలోన నమ్మవల దని బోధించి, అంగదుని నతని కప్ప గించి, కంఠమాలిక నతని కర్పించును. అంగదుఁడు తండ్రిపాటునకు వెక్కి వెక్కి యేడ్చుచుండ నాతనిని కరుణారస ముట్టిపడునట్లుఁ లాలించి, పిన తండ్రిని సేవింపు మని యాదేశించి, రామబాణనిహతుఁడగు చున్నందులకు సంతసించి, ప్రాణములు పోకమునుపే బాణమును బెకలింపు మని రామునిఁ బ్రార్థించును. రాముఁడు బాణము తీయుటతో నతని ప్రాణములు గూడ వెడలును. అంగద సుగ్రీవతారాదుల శోకము మిన్నంటును.

పురజను లీవృత్తాంతమును విని బహువిధములుగా తలంతురు. చివరకు వాలికంటె సుగ్రీవుఁడే యుత్తముఁడని సమాధానపడుదురు. రామునానతి

చొప్పున సుగ్రీవునకు కిష్కింధారాజ్యపట్టాభిషేకము జరుగును. పుణ్యాంగనలు ధవళములు, చెంచెతలు ఏలలు, పాడి రాముని గీర్తింతురు. సుగ్రీవుఁడు రామునకుఁ గానుకలువెట్టి కిష్కింధ కాహ్వానించును. కాని, మునివృత్తిఁ జరించుచున్న రామలక్ష్మణులు పట్టణవాసము నుజ్జగించి వానకాలము వెడలు నంతవఱకు మాల్యవంతమున నుండుటకు నిశ్చయించుకొందురు. కిష్కింధలో సుగ్రీవుఁడు తారాసమేతుఁడై వేడ్కగాఁ గాలము పుచ్చుచుండును.

ఈ కథలో నాయుపపట్టు సంఘర్షణము. రామాయణమున రామునకు సహాయకుఁడు సుగ్రీవుఁడు. ఈ కథలో సుగ్రీవునకు సహాయకుఁడు రాముఁడు. సుగ్రీవుని యుద్ధవిజయ మిందలి వస్తువు. ప్రతినాయకుఁడు వాలి. వాలి మరణము రాముని సహాయమున సాధించుట నాయకుని కార్యము. కథలో సంహావధ్యుఁడయ్యు నతనియందుఁ బఠితకు సానుభూతి కలుగవలెను. అది వాలి పరాక్రమౌదార్యవివేకవర్తనములవలన గొంత కలుగును. తారావిలాపము వలన కొంత కలుగును. అంగదుని శోకమువలన కొంత కలుగును. ప్రతినాయకుఁ డుద్ధతుఁడయ్యు విషాదనాయకునివలెఁ జిత్రింపఁబడవలెను. అట్టి చిత్రణమున కందుకూరి రుద్రకవి కృతకృత్యుఁడయ్యెను. ఈ కథలో ధర్మాధర్మములసంఘర్షణము కలదు. స్నేహవిరోధముల సన్నికర్షకలదు. దానిపై కథానిర్మాణమంతయుఁ జిత్రముగా సాగును. పఠిత నాకట్టుకొనును.

కందుకూరి రుద్రకవి సంభాషణల నిర్వహణమున నందెవైచిన చేయి. వానిని విస్తరించి రసపోషణముగా దీర్చిదిద్దుట యం దతడు శ్రద్ధవహించెను. హనుమంతుఁడు సుగ్రీవునితోడను. రామలక్ష్మణులతోడను, లక్ష్మణుఁడు హనుమంతుని తోడను చేసిన సంభాషణములను త్రిపుట, జంపె, ద్విపదలయందు విస్తరించి వ్రాసెను. సీతాస్మరణమున రాముఁడు పలికిన శోకాలాపముల నతివేలముగాఁ ద్రిపుటజంపెలలో విస్తరించి కరుణరసస్ఫోరకముగా రచియించెను. సుగ్రీవుఁడు రామునితోఁ బలికిన మాటలను జంపె త్రిపుట అటతాళగతులతో నడిపించెను. తార వాలితోఁ బలికిన పలుకులు అటతాళగతితోడను, వాలి సమాధానము జంపెతాళమునను, వాలి శ్రీరామునితో నన్నమాటలు త్రిపుట జంపె తాళములందును, రాముని సమాధానము జంపె తాళమునందును తారాశోకము అటతాళ, జంపెతాళ త్రిపుటతాళములలోను, వాలిభాషణము జంపె తాళమునను, ద్విపదలోను జనవాక్యములను జంపెలోను, వాలి రామునిఁజేసిః

ప్రశంస సీస పద్యము, జంపె లోను నడిపిన విధమును గాంచినచో నాతఁడు. రూపకప్రక్రియకనుగుణముగా నాయా పాత్రధారులు తత్తత్సన్నివేశములయందు సంభాషణలను బాడుచునభినయించుట కనువుగారచించినట్లుస్పష్టము కాఁగలదు.

కథా కథనమున నీకవి వచనమును,ద్విపదను, అర్ధచంద్రికలను ప్రధానముగా వాడుకొనినను, అంతర్గాథయైన వాలిసుగ్రీవులవైర వృతాంతమును వివిధ గతులలో రసోదంచితముగ నడిపెను రాముని శోకమూర్తిని వర్ణించు నర్ధచంద్రికయు(23) యుద్ధవర్ణనమున ద్విపదయు(50)సుగ్రీవుని దైన్యముననేకతాళముచు (52) ఛందోమర్మజ్ఞుఁడు చూపించు రచనాశిల్పములు.

ఈయక్షగానమున నున్నరచనలలో కథాకథనమును బాత్రసంభాషణమును బెనవైచికొనినవి కొన్నికలవు. దానివలన నీయక్షగానము కథాగానమున కుద్దేశింపఁబడినదని భావించుటకు వీలగుచున్నది. కాని, యట్టిపట్టులకంటె స్వతంత్రసంభాషణము లున్నభాగము లధికము లగుటచేఁ బ్రదర్శనానుకూల్య మీయక్షగానమున కున్నదని విమర్శకులు భావించుచున్నారు.

సంగ్రహరచమైనను ఈయక్షగానమున పాత్రలస్వభావ శీలములను గన్నులకు కట్టునట్లు కందుకూరి రుద్రకవి చిత్రించినాఁడు. ఇందు నాయకుఁడు సుగ్రీవుఁడు. అతనికి వాలి యన్నచో సింహస్వప్నము. రామలక్ష్మణులను గాంచి యతఁడు భయపడుటలో నది స్పష్టము స్నేహశీలి హనుమంతుని తోడనురామలక్ష్మణులతోడను అతఁడు వర్తించిన విధముననది నిరూపితము.అండయున్నచో గొండలను పిండిచేయువాఁడు రాముని సాయమున వాలితో యుద్ధమునకుఁ గడంగుట యందువలననే. కష్టము వచ్చినచో క్రుంగిపోవువాఁడు, అన్నను చంపియు నతనివియోగమునకు విలపించినవాఁడు. నమ్మినవారిని మోసగింపనివాఁడు.

శ్రీరాముఁడు ధీరోదాత్తుఁడు. ధర్మవర్తనుఁడు. అతని బహిఃప్రాణము సీత. ఆమెసొమ్ములను గాంచినప్పు డాతఁడు పొందిన శోకమతని ప్రేమకు వ్యాఖ్యానము.చూడుడు19త్రిపుట:అనంతదుఃఖము ముంచుకొనివచ్చిననుఅంతలో తేరుకొని కర్తవ్యనిష్ఠుఁడు కాఁగలడు. అది ధీరోదాత్తలక్షణము.కార్యముసాధించువఱకు నిదురపోనివాఁడు. ఆశ్రితరక్షకుఁడు. ఇట్టిగుణము లాతఁడు సుగ్రీవునకు విజయము సాధించిపెట్టుటలోఁ గానఁబడుచున్నవి.

లక్ష్మణుఁడు అన్నను వెన్నంటు నీడవంటివాఁడు. సమయోచిత వాక్య నిపుణుఁడు. హనుమంతుఁడు నమ్మినబంటు, మంత్రి, కార్యసాధన నిపుణుఁడు.

ప్రతినాయకపక్షమున వాలి, తార, అంగదుఁ డను పాత్రలు బలీయము లైనవి. సుగ్రీవుని విజయము వీరిని విషాదసాగరమున ముంచినది. అట్టి విషాద మును వివరించి రచించుటచే పఠిత కాపాత్రలయందు సానుభూతి కలుగు చున్నది. వాలిపాత్రను రుద్రకవి ఉదాత్తీకరించినాఁడు. అతని యహంకారము, తొందఱపాటు పరపతీవ్యామోహము, బలగర్వము సుగ్రీవుఁడు చెప్పిన కథవలనఁ దెలిసినను, అతఁడు వాలితో రణమున కేఁగుచు,

'గతిలేక పోయి రాఘవు మఱుఁగుఁ జొచ్చె రవి
సుతుఁడు నాకేమిటికి సుదతి ! యూరోత !'

యని తారతో ననిన పలుకులుఅభిమానస్ఫోరకములై పఠితలమనములఁ జూఱఁ గొనును.

'అన్నదమ్ములు మేము మాలో నలిగి చిత్తములోనఁ బోరుచు
నున్న నీకుఁ బ్రసక్తి గలదే యొకని దునుమన్'

అని రాముని ప్రశ్నించుట యందును,

"శ్రీరామ ! నీరామఁ జెఱఁగొన్న రావణుని
వారధుల ముంచితిని వాలమునఁ జుట్టి
ఒకమాట నాకుఁ జెప్పక పోయితివి గాక
సకలదైత్యుల దున్మి జానకిని దేనె"

అనెడి సాభిమానోక్తులయందును,

"రామవిభుతోడ మును పేమి చేసెదనంటి
నామాట చెల్లించి యతనికృప నొందు"

మని సుగ్రీవునికి బోధించిన హితోక్తులందును,

"ప్రతిలేని కపి రాజ్యపట్టంబు నినుఁగట్టి
సుతుఁడ ! నీవిభవంబు సూడలేనైతి"

నని సుతునితోఁ బలికిన కరుణరసార్ద్రములైన పల్కులందును, వాలి యభిమాన స్నేహ వాత్సల్యమూర్తులను రూపుకట్టించి కృతార్థుడైనాఁడు రుద్రకవి. తారా శోకము కరుణరసవార్ధి. ఆమె రామునిననిన ఎత్తిపొడుపుమాటలు రామబాణముల కంటె వాడియైనములుకులు. బాలుఁడైన అంగదుఁడు దుర్భర పితృశోకాకుల మూర్తి, వీరిసంభాషణలు రక్తికట్టించుట యే కథలోనిపట్టు. రుద్రకవి తన రచనాసామర్థ్యమంతయు నందుఁ బ్రదర్శించి చిరస్మరణీయుఁడయ్యెను.

సుగ్రీవవిజయమున నంగిరసము వీరము సుగ్రీవుని యందు శ్రీరామ వర్తితమైన వీరముపోషింపఁబడినది. వాలియందు రౌద్రముకరుణమును. తార యందు కరుణమును బోషింపఁబడినవి. ప్రతినాయకపక్షవర్తియైన కరుణరసము నాయకుని వీరమునకుఁ బోషకము. శ్రీరాముని పరాక్రమ జనితమైన వీరాద్భుత ములు అంగిరసపోషకములు.

కందుకూరి రుద్రకవి కవిత్వము నిరంకుశోపాఖ్యానమునందువలెఁ గాక యిందు ప్రసన్నమధురమై తేనెలూరుచుకథాప్రవృత్తికిని,రసవృత్తికిని,దోహదకారి యగుచున్నది. ఈయక్షగానము ప్రజాదరణపొందినదని చెప్పుచు కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినవాక్యము లిచ్చట స్మరణీయములు.

"ఈరుద్రకవి సుగ్రీవవిజయమునుగూడ స్త్రీవృద్ధ పామరాదులు పలువురు పాడుచుందురట! ఆయాపాత్రముల పాటలు తత్తద్వేషధారులు వచ్చిపాడు నట్లును, తక్కిన సంధివచనాదులు ఒకరిద్దఱు సూత్రధారప్రాయులు పఠించునట్లు నీసుగ్రీవవిజయము వీథియాటగా నాడఁబడుచుండెడిది."

ఈయక్షగానమున నొకవృత్తము, రెండుసీసములు, ఒకకందము, మూఁడు గీతపద్యములు, రెండువందలకు మించిన ద్విపదలు, సంధివచనప్రాయములైన వచనములు, త్రిపుట, జంపె, కుఱుచజంపె, అటతాళము, ఏకతాళము మొదలగు తాళప్రధానములైనదరువులు, ధవళములు, శోభన మంగళములు, ఏలలు, అర్ధ చంద్రికలు మొదలగు దేశిచ్ఛందములును వాడఁబడినవి.

సుగ్రీవవిజయ యక్షగానరచన మాకాలమునందు వెలసిన యక్షగానముల స్వరూపస్వభావములతో సంవాదము నొందుటయేకాక, తరువాత వెలసిన యక్ష

గాన రచనలపైఁ దన ప్రభావమును వైచినది. ఆంధ్రమున లభించుచున్న నత్యంత ప్రాచీనయక్షగానములలోఁ దలమానికముగా సుగ్రీవవిజయము ప్రసిద్ధికెక్కినది.

కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయము తమిళమున యక్షగాన రూపముననే అనువదింపఁ బడినది. ఆ యనువాద లిఖితప్రతులు మదరాసు ప్రాచీన లిఖితపుస్తకభాండార తమిళగ్రంథముల నం. 509—511. ఇట్టి గౌరవమీ యక్షగాన ప్రసిద్ధిని జాటుచున్నది.

ఈసుగ్రీవవిజయ యక్షగానమును కీ. శే. వేటూరిప్రభాకరశాస్త్రి గారిచే పరిష్కరింపఁబడి శ్రీ కపిలేశ్వరపురాధీశ్వరులచే ప్రకటింపబడిన ప్రతి నాధారముగాఁ గొని ప్రకటించుటయైనది. అందు శ్రీశాస్త్రిగారు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండారములోని యాఱుప్రతులను, ఆంధ్రసాహిత్య పరిషత్ప్రతులను రెండింటిని పరిశోధించి పాఠనిర్ణయములు గావించియుండిరి. ఆప్రతియందు దధస్సూచికలలో కొన్నిరాగములు సూచింపఁబడియున్నవి. ఉదా: త్రిపుట (3) ఆహిరిరాగము; అర్ధచంద్రికలు (5) సౌరాష్ట్రరాగము; జంపె (13) భైరవి రాగము; జంపె (15) కల్యాణిరాగము; త్రిపుట (19) ఆహిరి; జంపె (26) పాడిరాగము; అర్ధచంద్రికలు (27) నాటరాగము; అటతాళము (32) గంభీర నాటరాగము; అర్ధచంద్రికలు (34) పాడిరాగము; అటతాళము (36) ఆహిరి రాగము; త్రిపుట (41) ఆహిరిరాగము; జంపె (44) రామప్రియరాగము; త్రిపుట (46) ఆహిరిరాగము; ఏకతాళము (52) సౌరాష్ట్రరాగము త్రిపుట (55) ఆహిరిరాగము; అటతాళము (70) ఆహిరిరాగము; సంగీతమర్మజ్ఞులు వీని సార్థక్యమును భావింపఁగలరు. ఆప్రతియందే అధఃసూచికలో నిచ్చిన మంగళమును కావ్యాంతమంగళ సూచకముగా నుండనప్పననియు, తరువాతి యక్షగానములలో నదిగానవచ్చుచున్నదనియు భావించి యీప్రతిలో పాఠమునందేగ్రహించుటయైనది.

నే నీ పీఠికవ్రాయుటలోఆచార్యడా.యస్వీ జోగారావుగారిఆంధ్రయక్షగాన వాఙ్మయచరిత్ర ప్రధానముగాఁ దోడ్పడినది. కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రి, వాఙ్మయాధ్యక్షులు శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధానిగారలు రచించిన పీఠికలును వ్యాసములును సహాయకారులైనవి. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనముల నర్పించుకొనుచున్నాను.

కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పీఠికతో ప్రకటితమైన ప్రతిని నాకందఁజేసిన మిత్రులు శ్రీ నిడదవోలు సుందరేశ్వరరావుగారికిని, యీ గ్రంథమునకు పీఠికవ్రాయుట కవకాశమిచ్చుటయేకాక, ప్రస్తుత మందుబాటులోలేని ఈ యక్షగానమును ముద్రించి సాహితీబంధువులకు, విద్యార్థులకు నెనలేని సేవచేయుచున్న మాధవీబుక్ సెంటర్ అధినేత శ్రీ ఎ. వేంకటేశ్వరరావుగారికిని నా కృతజ్ఞతలు.

జి. వి. సుబ్రహ్మణ్యం

# సు గ్రీ వ వి జ య ము

## (యక్షగానము)

ఉ. శ్రీవిభుఁ గొల్చి శంకరు భజించి చతుర్ముఖు నెంచి భార్గవీ
గ్రావసుతాసరస్వతులఁ బ్రార్థన సేసి గణేశపాదపూ
జావిధి సల్పి దేశికుల సంస్తవనం బొనరించి కావ్యవి
ద్యావిదుల న్నుతించి కవితాజడుల న్నిరసించి వేడుకన్. 1

వ. అని కవీశ్వరుండు కృతీశ్వరుం డగు కందుకూరి జనార్దనస్వామి
నే మని కొనియాడుచున్నాఁడు. 2

త్రిపుట.

లలితగాత్రుఁడు శుభచరిత్రుఁడు దళితశత్రుఁడు సుజనమిత్రుఁడు
నలిననేత్రుఁడు కందుకూరి జనార్దనుండు.
ఇందిరార్యుఁడు సాధువర్యుఁడు పృథులశౌర్యుఁడు మేరుధైర్యుఁడు
నందితార్యుఁడు కందుకూరి జనార్దనుండు.
ధృతివిశాలుఁడు గానలోలుఁడు దివిజపాలుఁడు ధర్మశీలుఁడు
నతదయాళుఁడు కందుకూరి జనార్దనుండు. 3

వ. అని మఱియు సద్దేవతాసార్వభౌమునకు షష్ఠ్యంతంబులు
సెప్పిన విధం బెటువలెను. 4

అర్ధచంద్రికలు

చదువులు దెచ్చిన జలచరపతికిన్
కుధరము మోచిన కూర్మంబునకున్

మేదిని దాల్చిన యాదిమకిటికిన్
కనకకశిపుఁ దునిమిన నరహరికిన్
బలి నణఁచిన మాయలవడుగునకున్
మనుజేశులఁ గొట్టిన రామునకున్
రావణుఁ జంపిన రఘువర్యునకున్
భానుజుఁ గూల్చిన బలభద్రునకున్
దనుజసతులఁ దగిలిన బుద్ధునకున్
ఖలు నణఁపంగల కల్క్యాకృతికిన్
సర్వము దా నగు జన్నప్పనికిన్

వ. అంకితముగా నా యొనర్పంబూనిన సుగ్రీవవిజయం బను
యక్షగానంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

సీ. శ్రీరామచంద్రుండు సీతామహాదేవిఁ
గాననంబున వెదకంగ వచ్చి
పంపాసరోవర ప్రాంత్యభూములయందు
సౌమిత్రియునుఁ దాను సంచరింప
నావేళ సుగ్రీవుఁ డధికసంభ్రమముతో
ఋష్యమూకమున వర్తించుచుండి
చూచి యా ఘనుల తేజోవిశేషములకు
వెఱఁగంది మంత్రికోవిదున కనియె;

'వీరు మనలను వధియింప వేష మొంది
వాలిపంపున వచ్చినవారుగాను
నాకుఁ గాన్పించుచున్నది; గాకయున్నఁ
దాపసుల కేల శరచాపధారణంబు?'

వ. అని పలికి యచ్చోట నిలువంజాలక భయపడుచున్న సుగ్రీవునిం
హనుమంతుం డేమనుచున్నాఁడు.

త్రిపుట.

'కపికులోత్తమ! నాకుఁ జూడఁగఁ గపటవేషము గానరా దిది
విపులపుణ్యులఁ బాపమతు లని వెఱవనేలా.
ఏల యిచటికి వచ్చిరో వీ రెవ్వరో యీ రూపవంతులు
చాల పరిశోధించి చూతము జడియ వలదు.
రాజవంశ్యులు రాజతేజులు రాజపురుషులు రాజవీర్యులు
రాజసంబున నిటకు నేమిట రాఁగతంబో.
ఈ మనోహరరూపవైఖరు లిట్టి తేజముఁ గలుగువారికి
భూమి నెటువలె దుష్టగుణములు వొడమునయ్యా.
ఏను నచటికిఁ బోయి వారల పూనికంతయుఁ దెలిసి వచ్చెద
భానునందన! వెఱవ నేటికిఁ బంపు నన్ను.
నేర్పునను జని వారి రాకయు నియతవృత్తియు నిజముఁగల్లయు
నేర్పరించెద నుండు మిచ్చట నినతనూజా!' 9

వ. అని పలికిన 'నీవు పోయి వారల వృత్తాంతం బంతయుఁ దెలిసి ర'మ్మని హనుమంతుని బంపి సుగ్రీవుండు దా నచ్చోట నుండ వెఱచి మలయాద్రికిఁ బోయె; నట హనుమంతుండు రామలక్ష్మణుల సన్నిధికి వచ్చి దండప్రణామంబులు సేసి యే మను చున్నాఁడు. 10

త్రిపుట.

'అయ్య! మీరలు రాజసుతులో యతులొ తెలియఁగరాదు సందియ
మయ్యె మునివేషములు నృపచిహ్నములు గలుగన్
ఏల నిచటికి వచ్చితిరి మీ రెవ్వ రెప్పుడు నెచట నుందురు?
చాల మిముఁ గనుఁగొన్న మా కాశ్చర్య మయ్యెన్.

వెంట నెవ్వరు లేక యీ మునివేషములతో నడవిలోపల
నొంటిఁ దిరుగఁగ నేమి కార్యం బొదవె మీకున్?'

ద్విపద. అని పల్కి వినయమొప్పారంగ నున్న
హనుమంతుఁ జూచి యిట్లనియె లక్ష్మణుఁడు :
'వనచరవీర ! యిక్ష్వాకువంశమున
జనియించి లోకప్రశస్తుఁ డైనట్టి
దశరథేశ్వరుఁడు మా తండ్రి; యీ విమల
యశుఁడు రాముఁడు; లక్ష్మణాహ్వయుఁ డేను;
దండ్రియానతిమీఁదఁ దాపసవృత్తి
దండకాటవిలోన ధరణిజ మేము
సంచరింపఁగ రామజనపాలుదేవి
నంచితచారిత్ర యగు సీత నెత్తు
కొనిపోయె దుష్టమార్గుండు రావణుఁడు
మనమున నెంచక మము డాగురించి.
వాని పోఁబడి ఘోరవనభూములందుఁ
బూనికఁ దెలియంగఁ బూని యేతెంచి
కమనీయగుణపుష్పకబరి యా శబరి
సుమహితాత్ముఁ డటంచు సుగ్రీవుఁ జెప్ప
దానిచే నతని వృత్తాంత మంతయును
వీనుల కింపుగా విని యా కపీంద్రు
నాదరంబున నేలి యతని చిత్తంబు
ఖేదమంతయు మాన్పఁ గృప పుట్టి యిటకు
వచ్చినవార; మెవ్వఁడవు? మా మదికి
వచ్చియున్నవి నీ ప్రవర్తన ల్గొన్ని

దెలియఁజెప్పు' మటన్న దినకరవంశ
జలధీందునకుఁ గపిచంద్రుఁ డిట్లనియె: 12

జంపె.

'ఇనవంశతిలక ! నే నినతనూభవుమంత్రి
ననిలజుఁడ నాపేరు హనుమంతుఁ డంద్రు.
కపులకెల్లనురాజు కార్యఖడ్గములకు
నిపుణుండు సుగ్రీవుఁ డపరిమితబలుఁడు
మెలు వొందఁగా నతని మీకు బంటుగఁ జేయ
నలినాప్తకులవర్య! నాచేత నౌను.' 13

వ. అనిన రాఘవేశ్వరుని చిత్తం బెఱింగి లక్ష్మణుఁడు హనుమంతు
నితో నేమనుచున్నాఁడు. 14

జంపె.

'శ్రీరామచంద్రుఁ డాశ్రితరక్షకుఁడు మేరు
ధీరుండు శూరుండు దివ్యాస్త్రవిదుఁడు
ఈ మహామహుసేవ యేప్రొద్దుఁ గావింతు
నేమఱక బంటనై యేను గపివర్య !
పూనికొని రఘురామభూపతికి సాధింప
రానికార్యము లేదు త్రైలోక్యమునను;
ఐన రాజులు నొంటి నరుగ ధర్మము గాదు
కాన రాముఁడు మిమ్ముఁ గైకొనఁగఁ దలఁచెన్'. 15

వ. అని పలికి 'నీవు పోయి గొబ్బునఁ గార్యంబు సమకూర్పు' మని
పంపిన హనుమంతుండు శ్రీరామలక్ష్మణులకు మ్రొక్కి వీడ్కొ
నిన పిమ్మట నెటువలెను, 16

ద్విపద. అనిలనందనుఁ డేగి యర్కతనూజుఁ
గని మ్రొక్కి పలికె : 'నోకపికులాధీశ !
ఆరూఢి నీకు ననాయాసమునను
శ్రీరాముఁ డనెడి నిక్షేపంబు దొరకె;
నింక నీయక్కఱలెల్లను దీఱెఁ
గొంకక రఘురాముఁ గొల్వ మేతెంచి'
యనిన సుగ్రీవుండు హనుమంతుతోడ
ననియె సంతసమంది—'యనఘ! నీకతన
సలలితంబుగ రామచంద్రుని జూడఁ
గలిగె; నాశోకాంధకారంబు వాసె;
నాలస్యమేల చయ్యన ఋష్యమూక
శైలంబునకు రామజనపాలుఁ దోడి
తె' మ్మన్న నేఁగి ధాత్రీపాలసుతుల
సమ్మతిఁ దోడ్కొని సరగ నేతెంచి
నికటస్థలంబున నిలిపి సుగ్రీవు
నకు విన్నవించిన, నయమొప్ప నతఁడు
వచ్చి యా రాఘవేశ్వరునకు మ్రొక్కి
మచ్చిక నతనిచే మన్నన ల్గాంచి
యమ్మహామహునిచే నగ్నిసాక్షిగను
నమ్మిక ల్గొని, తాను నమ్మిక లొసఁగి
గుహలోపలికి దోడుకొనిపోయి, మున్ను
మహిపుత్రి యాకాశమార్గంబునందు
దనుజాధముండైన దశకంఠుఁ డెత్తు
కొనిపోవువప్పు డాకుధరంబుమీఁద
వడి మూటగాఁగట్టి వైచినయట్టి
తొడవులం గడుభక్తితోఁ గొంచు వచ్చి

యవనీశునకు నిచ్చి యవి వచ్చినట్టి
వివర మంతయుఁ దెల్పి విని మూర్ఛవోయి
యల్లనఁ దెలివొంది యా భూషణముల
నెల్ల నేర్పడఁ జూచి యెద నొత్తుకొనుచు. 17

వ. అప్పుడు దుఃఖావేశంబున రామచంద్రుం డేమని శోకించు
చున్నాఁడు. 18

త్రిపుట.

'హా సతీమణి! ధర్మచారిణి! హా గుణోన్నత! జనకసుత! నను
బాసిపోయితి వింతలోనే పద్మనయన!
ఎంత భయపడి తల్లడించితొ యెంత యడలితొ యెంత బడలితొ
యింతి! రావణుఁ డెత్తుకొని చన; నేమి సేతున్;
నన్ను విడిచియు నిలువఁజాలక నాతి! వచ్చితి వడవిఁ దిరుగను
నిన్ను విడి యే నెట్టు లోర్తును నీలవేణి!
లేఁటి మాయలు మదిని దెలియగలేక పాపపురక్కసునిచే
బోటి! నినుఁ గోల్పడితి నిఁక నా కేటి బ్రతుకు;
ఇందుముఖి! నినుఁ బాసినప్పుడె యేల పోకను నిలిచెఁ బ్రాణము?
నిందలకుఁ బాల్పైతి ధరలో నిన్నుఁ బాసి;
రమణిరో! నినుఁ బాసినప్పుడె రాతిరే శివరాత్రి రాయెను
నిముసమైనను నాదుకంటికి నిదుర రాదు;
పలుకుపలుకున నొలుక నమృతము పలుకనేర్చిన జాణ! ముద్దుల
కలికి! చిలుకలకొలికి! నీ న్నెటం గందునొక్కొ!
కూడఁజని యాపసిఁడిమృగమును గూల్చి చర్మముఁదెచ్చినాఁడను
వేడుకలు గనుఁగొనఁగనేరక వెఱ్ఱి నైతి;

లలన! నినుఁ గలనైనఁ బాయఁగఁగలన, నీ విట లేకయుండినఁ
జలనమొందెను నాదు హృదయము జలజనయనా!
నన్ను నీ వెడఁబాయ వెన్నడు; నిన్ను నే నెడఁబాయఁజాలను;
గన్నరో! యీవెతలు వచ్చెను గడవఁదగవే.' 19

వ. అని మఱియు నేమనుచున్నాఁడు. 20

జంపె.

'తరణికులమునఁ బుట్టి శరచాపములు పట్టి
తరుణిఁ గోల్పడుకంటె మరణమే మేలు!
నను శౌర్యవంతుఁ డని తనపుత్త్రి నిడినట్టి
జనకవిభుఁ డీవార్త విని వగవకున్నె!
ఒకట నొచ్చము లేకయున్న రవివంశమున
కకట నాచే నింత యపకీర్తి వచ్చెన్.' 21

వ. అని పలికి రాఘవేశ్వరుం డెటువలె నుండెను. 22

అర్ధచంద్రికలు.

కన్నుల నశ్రులు గ్రమ్మగ వగచున్
ఔరా విధివశ మని తల యూఁచున్
ఏటికి ప్రాణము లిఁక నని తలఁచున్
క్రమ్మఱ సొమ్ములు రొమ్మున నొత్తున్
ఏగతి నోరుతు నిఁక నని పలుకున్
బాపురె విధి యని ఫాలము ముట్టున్. 23

వ. అని పలికి 'వగవ సమయం బిది గాదు జానకిని సాధించుటకు మున్ను వీని పగ దీర్తు' నని తలంచి సుగ్రీవునితో రామచంద్రుం డి ట్లనుచున్నాఁడు. 24

గీ. 'సమ్మసుగ్రీవ ! యింద్రనందను వధించి
నిఖిలవానరరాజ్యంబు నీకు నిచ్చు
వాఁడ; మీలోన మీకును వైర మైన
కారణం బేమి ?' యనఁ బల్కె గపివరుండు: 25

జంపె.

'అఘవర్తనుండు మాయావి యనియెడువాఁడు
రఘువంశతిలక ! యొక రక్కసుఁడు గలఁడు;
వాలితో నని సేసి వాఁడు నిల్వఁగలేక
శైలగుహ చొఱఁబాఱె చని భీతితోడన్.
చనినఁ బోవఁగనీక చనియె వెంబడిఁ దాను
వనచరేంద్రుఁడు నన్ను వాకిటనె యునిచి
చని వానితో నొక్క సంవత్సరము పోరె
ననిమిషాధిపసూనుఁ డాబిలములోనన్.' 26

ర్ధచంద్రికలు.

'అంత నెత్తురుటేఱు లంతటనె వచ్చెన్
రక్కసుని ఘోషములు వెక్కసము లాయెన్
వినరాకపోయెఁ గపివీరవరుపలుకున్.' 27

'అంత నేను చింతాక్రాంతుండనై రాక్షసునిచేత వాలి మృతుండాయె నని నిశ్చయించి యాగుహవాత నొక్క పాషాణంబుఁ ద్రోచి యింద్రజునకుఁ దిలోదకంబులు విడిచి కిష్కింధకు వచ్చినప్పు డెటువలె నుండెను.' 28

ఋచజంపె.

'వనచరోత్తములెల్ల వచ్చిమంచి
దినము చేకొని నన్నుఁ దెచ్చి

కపిరాజ్యపట్టంబు గట్టి-రెల్ల
కపులు చూడఁగ మూఁకగట్టి
మెఱయ నను దొరను గావించి-కొలిచి
రిరుగడల భక్తిచే మించి.'

ద్విపద.

'అంత నారాక్షసు ననిలోనఁ ద్రుంచి
సంతోషచిత్తుఁడై చనుదెంచి వాలి
యగ్గిరిగహ్వరం బంతయుఁ దిరిగి
యగ్గుహావాశిల నుగ్గుగాఁ దన్ని,
యచ్చోట నను గాన కాగ్రహం బొదవఁ
జెచ్చెరఁ గదలి కిష్కింధకు వచ్చి,
వనచరకోటి కొల్వంగ నున్నట్టి
ననుఁ జూచి పలికె వానరులు భీతిల్ల,
ఓరి దుష్టాత్మ! సహోదరుఁ డనుచుఁ
గూరిమి నీను నమ్మి గుహావాత నునిచి
పగఱపైఁ జనిన నాపాటు గన్గొనక
తెగి రాజ్యభారంబు దీర్పవచ్చితివి;
చేటు గోరుచు నున్న చెనటివి నీవు
పాటించి నమ్మితి బంధుండ వనుచు;
ద్రోహివి నినుఁ బట్టి త్రుంపక రోష
దాహంబు తీఱదు తపనజ నాకు,
నని పల్కి నాపత్ని యగు రుమాకాంతఁ
గొని నాప్రధానులఁ గొట్టి నాతోడ
కదనంబు సేయ నక్కడ నిల్వలేక
కొదుకుచు వచ్చి యీకొండ నెక్కితిని.

ఈ కొండ యవ్వానరేశ్వరుఁ డెక్క-
రాకుండ శపియించె రఘురామ! తొల్లి
యనఘుఁడైన మతంగుఁ డను మహామౌని
యనిన సుగ్రీవున కనియె రాఘవుఁడు. 30

వ. 'ఏమికతంబున వాలి కీకొండ నెక్క-రాకుండ మతంగుండు శపి
యించె' నని యడిగిన రామచంద్రునకు కపిచంద్రుం డేమను
చున్నాఁడు,

అటతాళము.

'అసురవీరుఁడు గలఁడు దుందుభి యనఁగ నొకఁడు, నిర్జర
విసరమును బలుమాఱు గెలిచిన విజయశాలి;
అనఘ వాఁ డొకనాఁడు మహిషం బగుచు వచ్చి, వారిధి
ననికిఁ బిలిచినఁ జాల భయపడి యంబురాశి
ఘనతరం బగు రత్నజాలము కాను కిచ్చి, పలికెను
దనుజవల్లభ! వెఱతు నీతోఁ దలపడంగన్;
ఈజగంబున వింధ్యపర్వత మేమొకాని, నీతో
నాజి కెంతటివాఁడు గావలె నసురవర్యా!' 32

వ. 'అనిన విని ధైర్యగుణావంధ్యం బగు వింధ్యంబు కడకేఁగి తన
సత్త్వంబు చూపె నట యెటువలెను.' 33

అర్ధచంద్రికలు.

'శృంగములఁ బడఁబొడిచె నగ్గిరిశృంగములను
పాదములఁ బడఁదన్నె నగ్గిరిపాదములను
గండములఁ బడఁద్రోచె నగ్గిరిగండములను.' 34

ద్విపద. 'అపుడు చిత్తంబులో నతిభీతి నొంది
విపుల సంభ్రమముతో వింధ్యాద్రివిభుఁడు

దనుజవల్లభునకుఁ దనయందుఁ గల్గు
ఘనతరవస్తువు ల్కానుక లిచ్చి
దానవాధీశ ! నాతరమె నీతోడఁ
బూని కయ్యము సేయఁ బోయి వేగంబె
అసమానబలశాలి యగు వాలితోడఁ
గసిదీర యుద్ధంబు గావింపు మతఁడు
నీకు మార్పడి పోరనేర్చు నటన్నఁ
జేకొని వాఁడు కిష్కింధకు వచ్చి
గుహలెల్ల ఘూర్ణిల్ల కొండలు డుల్ల
మహి తల్లడిల్ల సామజములు డిల్ల
ననిసేయఁ బిలచిన నసురేంద్రుమీఁద
వనచరమండలేశ్వరుఁడు కోపించి.' 35

**అటతాళము.**

'రోషమున గుహ వెడలి శైలవిరోధిసుతుఁడు, మహిష
వేషమునఁ బొలుపొందు దానవవిభునిఁ జూచి,
రెండుకొమ్ములు పట్టుకొని పోకుండ నాఁగి, కపినా
థుండు మాయాదైత్యు మహిఁబడఁద్రోచి చంపెన్.
లీల మీఱఁగఁ జంపి వానికళేబరంబున్, దన్నెను
జాలఁ బౌరుష మొప్ప నొక యోజనము పోవన్.
తన్నినప్పుడు దానవునిరక్తంబు వచ్చి, మెండుగ
నిన్నగేంద్రము మీఁదఁ బడిన సహింపలేక,
బల్లిదుండు మతంగముని శాపం బొసంగెన్, వాలికి
నెల్లకాలం బిమ్మహీధర మెక్కకుండన్.
ఆకళేబర మంతదూరం బరుగఁ జిమ్మన్, వాలికిఁ
గాక చెల్లునె యన్యులకు రాఘవనృపాలా !' 3

వ. అని పలికి యా కళేబరంబుదగ్గఱకు రామచంద్రుం దోడ్కొని
పోయి సుగ్రీవుం డేమనుచున్నాఁడు. 37

జంపె.

'ఇదియొక్క యోజనము హెచ్చుగాఁ జిమ్ము నీ
పదపద్మయుగమునకు బలిమి గలదేనిన్
వాలికంటెను నిన్ను వరబలాధికుఁ డనుచు
జాల నమ్మఁగవచ్చు జనపాలతిలక!
చెలువొంద నిటుసేయఁ జేరు ధైర్యము నాకు
బలకాంక్ష చేకూరు భక్తిచే నిపుడు.' 38

గీ. అని నవిని రాఘవేశ్వరుఁ డలఁతినవ్వు
నె మ్మొగంబునఁ జిగురొత్త నిలిచి పాద
వనరుహాంగుష్ఠమున జిమ్మె దనుజవరుని
సముదితాంగంబు పదియోజనములఁ బడగ. 39

వ. ఇవ్విధంబునం దుందుభికళేబరంబు తన బొట్టనవ్రేలఁ బదియోజ
నంబుల పొడవు బడఁజిమ్మి నిలిచిన రామచంద్రునితో సుగ్రీవుం
డేమనుచున్నాఁడు. 40

త్రిపుట.

'నరవరోత్తమ! వాలి చిమ్మెడు నాఁడు దైత్యకళేబరంబున
నరయ నున్నవి రక్తమాంసము లధికముగను.
చిమ్మితివి నేఁ డస్థిమాత్రము చిక్కియున్నది గాన మిక్కిలి
నమ్మలే నే నధికబలుఁ డని నరవరేణ్యా!
ఇట్టిసంశయ మడఁగుటకు నా యిచ్చ నొక్కవిధంబు దోచెను
గట్టిగా వినిపింతు నది విను ఘనతమీఱన్.' 41

అటతాళము.

'జోడు గూడక వక్రగతులగు నేడుతాళ్లన్, సరిగాఁ
గూడఁ గొఁగిటఁ బట్టి యాకులఁ గోయు వాలి
తరువులేడును గాఁడ నొక యస్త్రంబు దొడిగి, యేసిన
వరబలాధికుఁ డనఁగ వచ్చును వాలికంటెన్'
అనుచుఁ బలికిన నవ్వి రాఘవుఁ డమ్ము దొడిగి, యేసెను
ఘనతరం బగు నేడుతాళ్లను గాఁడి పాఱన్
తరువులేడును గాఁడి యాభూధరము గాఁడి, శేషుని
పురము గనుఁగొని శరముగ్రమ్మఱఁ బొదికి వచ్చెన్. 42

వ. అప్పుడు రామచంద్రునకు సుగ్రీవుండు సాష్టాంగదండప్రణామంబు సమర్పించి యేమని కొనియాడుచున్నాఁడు. 43

జంపె.

'భుజవినిర్జితతాల బుధవిహంగరసాల
రజనీచరాభీల రామభూపాల
దివిజనార్చనలోల తేజోబలాభీల
రవివంశసంశీల రామభూపాల
సమరాగ్రజయశీల శత్రుజనవాతూల
రమణీయగుణజాల రామభూపాల.' 44

వ. అని మఱియు సుగ్రీవుం డేమనుచున్నాఁడు. 45

త్రిపుట.

'దేవ! నీమహిమంబు తెలిసియుఁ దెలియనైతి మనంబులోఁ బ్ర
జ్ఞా విహీనుఁడనైతి మిక్కిలి జడుఁడ నైతిన్.
నీకె యీశరలాఘవము దగు నీకె తగు నీ చిత్రమహిమము
లోకులకు లే దఖిలయఁగా నేలోకములను,

కరుణతో నానేరమంతయుఁ గాచి యాపదలెల్ల దీర్చియుఁ
బరమపావన ! యేలు నను నీబంటుగాను.
శరణు జొచ్చిన వానిఁ గాచుట జానకీపతి! యుత్తమంబయి
వఱలుఁగావున నన్నుఁ గావుము వాలి యెదురన్.
నిన్ను నమ్మితి నన్నుఁ గావుము నిక్క మిల నాదైవ మైతివి
సన్నుతింపఁగ నెంతవాఁడను సరసిజాక్ష !' 46

వ. అని సన్నుతించిన సుగ్రీవునిం జూచి శ్రీరామచంద్రుండు దయా
రససమన్వితుం డగుచు నేమనుచున్నాఁడు. 47

తే. 'పొమ్ము సుగ్రీవ! కిష్కింధపురమునకును
వాలితోఁగూడ యుద్ధంబు లీలఁ జేయు
నాదు శరముల నాతని నమర ద్రుంచి
నిఖిలవానరరాజ్యంబు నీకు నిత్తు.' 48

వ. అని పంపి తానును వెంబడి లక్ష్మణసహితంబుగా వచ్చి యొక్క
వృక్షంబు చాటున నుండె నప్పు డెటువలె నుండెను. 49

ద్విపద. దినకరతనయుండు దేవేంద్రతనయు
ననినేయఁ బిలిచిన నాయింద్రసుతుఁడు
కినుకతో వచ్చి సుగ్రీవుని ఱొమ్ము
తన ముష్టిఁ బొడిచినఁ దపననందనుఁడు
జడియక యొక మహాశైలశృంగంబు
వడిమీఱఁ గొనివచ్చి వాలిపై వైవ
బలభేదిసుతుఁ డది పగులంగఁ దన్ని
జలజాప్తసూను మస్తక మఱచేత
మొత్తిన' నొక్కింత మూర్ఛిల్లి తెలిసి
యత్తఱి సుగ్రీవుఁ డచలేంద్ర మొకటి

పెకలించుకొనివచ్చి భీకరధ్వనులు
ప్రకటించి దేవతాపతిపుత్త్రు నేయ
దానిచేఁ గడు నొచ్చి దశకంఠువైరి
భానుజుఁ జొరఁబడి పట్టుకపొడువ
బలమఱి రఘురాముపై దృష్టి నతఁడు
నొలవక దిక్కులు చూచుచునుండె. 50

వ. అయ్యవసరంబున వృక్షంబుచాటుననుండి రామచంద్రుం డేమని
వితర్కించుచున్నాఁడు. 51

ఏకతాళము.

'ముక్కులు చెక్కులు మూఁపులు వీపుల్
ప్రక్కలు పిక్కలు బరులును దరులున్
స్వరములు శిరములు జానులు వీనుల్
కరములు నురములు కాళ్లను వ్రేళ్లన్
ఎక్కువతక్కువ లింతయులేకన్
ఒక్కరూపమున నున్నవి చూడన్.' 52

గీ. 'ఏర్పరింపఁగ రాకున్న నితఁడు వాలి
యితఁడు సుగ్రీవుఁ డని యెట్లు లెఱుఁగవచ్చు;
నెవ్వఁ డీల్గునొ తొడిఁబడ నీయమోఘ
సాయకం బేయ' నని రాముఁ డేయకుండె. 53

వ. అంత నొక్కవిధంబున వాలిచేత విడిపించుకొనివచ్చి ఋశ్యమూక
పర్వతం బెక్కి తన్నుఁ జేరవచ్చిన రామచంద్రునితోఁ దలవంచు
కొని సుగ్రీవుం డేమనుచున్నాఁడు. 54

త్రిపుట.

'దేవ! నమ్మితి నిన్నుఁ గరుణాదృష్టిఁ జూచెద వనుచు నయ్యో
కావవైతివి వాలిచేతను గాసి పడఁగాను;
నిజము పలికితి వాలిఁ జంపెద నిన్నుఁ గాచెద నంచు నయ్యో
భుజబలోన్నత! యింతలోనే బొంకఁ దగునే?
ఇనకులుండవు సత్యసంధుఁడ వీవు బొంకితి వనఁగ వచ్చునె
యనఘ! యిటువలె నగుట నాపుణ్యంబుగాక.' 55

ద్విపద. అనిన సుగ్రీవున కనియె రాఘవుండు :
'వనచరోత్తమ! యేల వగచెద వింక
వారక చూడఁగా వాలిరూపంబు
నీరూప మొక్కటై నియతితో నుండ
నేయ కుండితి నింతె యిమ్మహాఘోర
సాయకం బెవ్వనిఁ జంపునో యంచుఁ;
గర మొప్పునట్టి యీ గజపుష్పమాల
ధరియించి పోయి యుద్ధము సేయుచుండు;
మిప్పుడేమియుఁ జెప్ప నేల సుగ్రీవ!
యప్పుడు చూడు నాయంతరంగంబు'
నావుడు రఘురామునకు జాగి మ్రొక్కి
భూవిభుఁ డిచ్చిన పుష్పదామంబు
గళమున నిడి పోయి కమలాప్తసుతుఁడు
బలభేదినందను బవరమ్మునకును
బిలిచిన విని రోషభీషణాకార
కలితాత్ముఁడై వాలి కడు నవ్వి పలికె : 56

తరళము.
'చంపఁజాలక విడిచిపెట్టిన నరకు గొనక, వీఁడొక
తెంపుగల మగవానివలెనే తిరిగివచ్చెన్;

వీని నిఁక మఱి ప్రాణములతో విడిచిపెట్టం, జెల్లదు
పూని చంపెద నంచు నంతఃపురము వెడలెన్;
తార యడ్డమువచ్చి నయ మరుదారఁ బలికెన్, 'విజయో
దార ! యేటికిఁ బోయెదవు రవితనయుమీఁదన్?
నిన్న నీచే భంగపడి చెడి నేడువచ్చునె పోరికిన్, తిరిగియు
పన్నతనమున నొక్క బలియుని ప్రాపులేక
అనఘ! యంగదుచేత నొకకార్యంబు వింటిన్, దశరథు
పనుపునను రాఘవుఁడు కాననమునకు వచ్చెన్.
వనితఁ గోల్పడి పోయి యల దశవదనుచేతన్, దినకర
తనయుఁ గైకొని బాసఁలిడెనట నిను వధింపన్;
అమహాత్ముఁడు మనుజమాత్రుం డనఁగరాదు, త్రిభువన
ధాముఁ డచ్యుతుఁ డతని గెలుఁవగఁ దరముగాదు;
రమణతో సుగ్రీవునకుఁ గపిరాజ్య మిచ్చి, గొబ్బున
సమరభీకరుఁడైన రాఘవు శరణుసొరుము.' 57

వ. అని పలికిన చిఱునవ్వు నవ్వి యవ్వీరాగ్రగణ్యుండు తారతో నే
మనుచున్నాఁడు. 58

జంపె.

'గతి లేక పోయి రాఘవు మఱుఁగు జొచ్చె రవి
సుతుఁడు నా కేమిటికి సుదతి! యీరోఁత
ననువంటి బలసమేతుని విడిచి చేపట్టె
నినతనూజుని రాముఁ డేనీతిపరుఁడు ?
దశకంధరునిచేతఁ దరుణిఁ గోల్పడినపుడె
దశరథాత్మజులావు తలఁప నేమిటికి?
చాలు నీపని లేని జోలి యేమిటికి?రణ
కేళిఁ జంపెదను సుగ్రీవు నిదె పట్టి.'

ద్విపద. అని తార మదిలోని యడలు వారించి,
ఘనగతి కిష్కింధ కదలి యేతెంచి,
యుగ్రనిశ్వాసముల్ హుమ్మని వెడల
సుగ్రీవు ముందఱ శూరతఁ బలికె :
'ఓరి ! నాతో నిన్న యుద్ధంబు సేసి
పాఱియు నిపు డేల పఱతెంచి తీవు.
నీతియు సిగ్గును నెఱయంగ విడిచి
యేతెంచితివి శిర మిదె త్రుంచువాఁడ
నిలునిలు, మని గర్వనిర్వాహమహిమ
తలపడి ఘోరయుద్ధము సేయుతరిని
వాలిశౌర్యమునకు వడి నిర్వహింపఁ
జాలక భీతుఁ డై జలజాప్తసుతుఁడు
వడిచెడి పాఱిపోవను గాళ్లు రాక
తడఁబడఁగా' నింక తడయరా దంచు
మెల్లన చేరి సౌమిత్రిచే నున్న
వి ల్లందుకొని రామవిభుఁ డెక్కుపెట్టి
యురగేంద్రనిభ మైన యొకదివ్యశరము
తిర మొప్ప సంధించి తెగ నిండఁ దిగిచి
వానరాధీశ్వరు వక్షస్థలంబుఁ
బూనిక గుఱిసేసి పొంచి యేయుటయు
ననలకీలలు గ్రమ్మ నమ్మహాశరము
చని వాలిఱొమ్ము వెచ్చనినెత్తు రొలుక,
సరిపట్టె నప్పు డాశరథనందనుఁడు
శరముతోడనుగూడ జగతిపై వ్రాలె. 60

సీ. తరువు లేడు గాఁడి డగ్గరి గిరి దుల్చి
జగతి గాఁడి యురగజగతి గాడి

దొనకు వచ్చునట్టి మనుజేశుబాణంబు
ప్లవగనాథుఁ దూఱి పాఱదయ్యె. 61

వ. అంతం దన్నుం జేరవచ్చిన రామచంద్రువంకిం జూచి వాలి
మనుచున్నాఁడు. 62

త్రిపుట.

'నాయ మెఱుఁగక చంపితివి నరనాథ! పాపముఁ గట్టుకొంటివి
బోయ వింతియెకాక నీ వొక భూమిపతివా?
భ్రాంతి యయ్యెనె సకలధరణీభారనిర్వహణై రఘుజునకుఁ
క్రోతిఁమాంసం బేల తలఁచితి క్రూరబుద్ధిన్?
అన్నదమ్ములు మేము మాలో నలిగి చిత్తములోనఁ బోరుచు
నున్న నీకుఁ బ్రసక్తి గలదే దునుమన్;
ఏవగింపక మౌని వయ్యును హింసఁ జేసితి వదియు దొంగిలి
భూవిభుడవు గావు తపసివి గావు నీవు;
తప్పు గలిగిన నాజ్ఞవెట్టను తగును భరతేంద్రునకు న్యాయము
తప్పి నీకు వధింపఁజెల్లునె తపసివర్యా!' 63

వ. అని మఱియు నేమనుచున్నాఁడు. 64

జంపె.

'కరుణాపయోధి రాఘవుఁడు ధర్మాత్ముఁ డనీ
నరు లెంచఁగాఁ గాక నమ్ముదునె నిన్ను;
బలిమిగా నీ వింత పాపకర్మంబునకు
తలఁచు టే నెఱుఁగ కెంతయు మోసపోతి;
ననుఁ బేరుకొని పిల్చి నాముఖాముఖి నిల్చి
జననాథ! పోరాడి చంపలేవైతి;
పొంచి యేసితి రామభూపాల! కులధర్మ
మెంచుకో లేవైతి వెంత చేసితివి;

శ్రీరామ! సీరామఁ జెఱఁగొన్న రావణుని
వారిధుల ముంచితిని వాలమునఁ జుట్టి;
ఒకమాట నాకుఁ జెప్పకపోయితివి గాక
సకలదైత్యుల దున్మి జానకిని దేన.' 65

వ. అనిన రామచంద్రుండు వాలితో నేమనుచున్నాఁడు. 66

జంపె.

'ఏల కపివర్య! యీవాలుమాలినమాట
లోలి నాడెదు శౌర్యశాలివై యుండి?
రోసమున నిజసోదరుని యాలి గైకొన్న
దోసకారివి నిన్ను ద్రుంపనే తగవు:
పరమధార్మికుఁడైన భరతవిభు పంపునను
జరియించుచును దోషకరుఁ జూడఁగలమ?
పొంచి యేసితి వంటి భువిలోన మృగములను
పొంచి యేయకయున్నఁ బోవె దవ్వులకు?
ధర్మమే జయ మనుచుఁ దలపఁనేరని ఘోర
దుర్మార్గులకు బ్రతుకు దూరమై చనదె.' 67

వ. అని పల్కు సమయంబున వాలి మూర్ఛాగతుండయ్యె నఁట యెటు
వలెను. 68

ద్విపద. అంత నావృత్తాంత మగచరుల్గొంద
అంతఃపురంబున కరిగి వేగంబె
తారతో వినుపింప ధైర్యంబు వదలి
దారుణం బగు మూర్ఛ దద్దయు మునిఁగి
మెల్లనఁ దెలిసి యామీనాక్షి హస్త
పల్లవంబులు సాఁచి పాపట చెదర

వడి మోదుకొనుచును వాలుఁగన్నులను
వడియు బాష్పజలంబు వఱదలై పాఱ
నడుగులు తడఁబడ నఱుపేదనడుము
గడగడ వడఁక ముక్తామణుల్ రాల
పెనఁగొన్నపెన్నెరు ల్వీఁపుఁదుపైఁ దూలఁ
జనుదెంచి జీవితేశ్వరుమీఁద వ్రాలి
ఎలుఁగెత్తి బెట్టుగా నేడ్చి ప్రాణేశు
తలయెత్తి మెల్లనె తనతొడఁ జేర్చి
పయ్యెదకొంగునఁ బతిముఖాంభోజ
మొయ్యనఁ దుడుచుచు నువిద యిట్లనియె. 69

అటతాళము.

'కపికులోత్తమ! కపిశిఖామణి! కపివతంసా! నిర్మల
కపికులాంబుధిపూర్ణహిమకర! కపివరేణ్యా!
ఎల్లలోకము లేలునట్టి సురేంద్రునకునున్ బుట్టిన
బల్లిదుండవు నీవు మనుజుని బారిఁ బడితె!
అలుక మీరఁగ రావణాసురు నబ్ధులందున్ ముంచిన
బలసమున్నతి నేఁడు తొలఁగెనె ప్రాణనాథ!
అమృతవారిధిఁ ద్రచ్చి దివిజుల నాదుకొన్న మగఁటిమి
సమసిపోయెనె నేఁడు కపికులచక్రవర్తి!
రామచంద్రుండు నరుఁడు గాఁడు పురాణపురుషం డనుచు నయ్యో
వేమఱును బలవించి చెప్పిన వినకపోతి;
ఏమి సేయుదు? శోకవారిధి నెట్లు గడతు? దైవము
నేమి యని పలవించి దూఱుదు? నెందుఁ జొత్తున్?
క్రాలు గన్నులనీరు వఱదలు గాఁగ నేడ్చు నంగదు
నేల మాన్పవు సుతునిపై దయ యెందుఁ బోయెన్.' 70

వ. అని మఱియు నే మనుచున్నది. 71

జంపె.

'ప్రాణేశ ! నీవంటి పతి జన్మజన్మములకు
నేణాంకబింబాస్య కిలఁ గలుగఁగలఁడె !
కపికులోత్తమ ! రాయి గాబోలు నాగుండె
యిపుడు తుమురై పోవ దేమి సేయుదును?
నాపాలి దేవుఁడవు నా ప్రాణనాథుఁడవు
నీ పొందు లేకున్న నే నెట్టు లోర్తు?
పలుమాఱు నావంటి పాపాత్మురాలికిని
నెలమి నీ సంసర్గ మేల సిద్ధించు?
వనచరోత్తమ ! నీవు చనినలోకంబునకు
నెనయ వచ్చెదఁగాక యిం నుండఁగలనే' 72

వ. అని పలికి తన యెదుర నున్న సుగ్రీవునిం జూచి తార యే మను
చున్నది. 73

జంపె.

'భానువంశజుఁడు నీపాలింటిదైవమై
వానరేశ్వరుఁ జంపె వర్ధిల్లు మిఁకను;
ఏపాటి పౌరుషము హెచ్చె నిందుల నీకుఁ?
బాప మని మదిలోనఁ బరికింపవైతి;
నీకోరినట్లయ్యె నీతపం బీడేఱెఁ
గైకొని యేలు మీ కపిరాజ్యమెల్లన్.' 74

వ. అని సుగ్రీవునిం జూఱి రామచంద్రుఁ గనుంగొని యేమనుచున్నది.

త్రిపుట.

'ఆలి చెఱఁగొని పోయినట్టి దశాస్యుఁ డుండఁగ నిర్నిమిత్తము
వాలి నేటికిఁ జంపితివి రఘువంశతిలకా !
ఇట్టి సాహసకర్మ మెచటికి నేఁగె భరతుఁడు సీమ వెడలఁగఁ
గొట్టి రాజ్యము పుచ్చుకొన్నెడఁ గువలయేశా !
నాయ మేటికిఁ దప్పితివి రఘునాథ ! జానకితోడనే చెఱఁ
బోయెనే నీరాజనీతియు భూరిమతియున్;
పుణ్యపాపము లెఱుఁగ వెక్కుడి భూవరుండవు నీవు తలఁపఁగ
గణ్యుఁడవె గుణహీనుఁడవు నీ ఘనత యెంత ?
ఎన్న నెటువలెఁ బుట్టినాఁడవొ యినకులంబున నకట నిను రా
జన్న దోషము వచ్చు హరిహరి యనఁగ విన్నన్.' 76

వ. అని పలుకు సమయంబున వాలి మూర్ఛం దెలిసె; నప్పుడు తన సమీపంబున శోకబాష్పకలితనేత్రుం డయి తలవంచుకొని యున్న సుగ్రీవునిం జూచి యే మనుచున్నాఁడు. 77

జంపె.

'వగ పేల సుగ్రీవ ! వైరమెల్లను దీఱె
జగ మెఱుంగగ రామచంద్రుచే నిపుడు;
రమ్మి సూర్యతనూజ ! రాజులను మదిలోన
నమ్మకుము; వారిమన్నన లస్థిరములు;
రామవిభుతోడ మును పేమి చేసెదనంటి
వామాట చెల్లించి యతనికృప నొందు.
దినకరాత్మజ ! నాకు దేవేంద్రుఁ డిచ్చె నీ
కనకమాలికఁ దొల్లి కడుసంతసిల్లి;
ఇది గళంబునఁ దాల్చి యెల్ల కపిరాజ్యంబు
పదిలుండవై యేలు బహువత్సరములు;
అంగదుఁడు బాలకుం డరయఁ డేమియు నంత
రంగమున దయయుంచి రక్షింపుమితని;

మా నేరములఁ దలచి మదిలోన గోపింప
కీ నిసువు నీడేర్పు మితఁడె నీ సుతుఁడు. 78

వ. అని పలికి సుగ్రీవునకుఁ దనమెడ నున్న కంఠమాలిక నిచ్చి వెక్కసంబుగా శోకభరంబున వెక్కి వెక్కి యేడ్చుచుం దనమొగంబు చూచుచున్న యంగదుని జూచి వాలి యే మను చున్నాఁడు. 79

జంపె

'ఓతనయ ! శోకించుచుండ నీ కేమిటికిఁ
బ్రీతి సుగ్రీవుండు పినతండ్రిగాఁడే ;
నీమీఁదఁ గడు ప్రేమ నిను జాల మన్నించు
నామాటగాఁడె యీ నలినాప్తసుతుఁడు ;
ఏమఱక సుగ్రీవుఁ డేమికార్యముఁ జెప్పఁ
దామసింపక చేసి తండ్రికృపఁ బొందు ;
అన్న ! యిన్నాళ్ల వలె నాగడంబులు సేయ
కెన్న నెవ్వరికైన హితమాచరింపు ;
ప్రతిలేని కపిరాజ్యపట్టంబు నినుఁ గట్టి
సుతుఁడ ! నీవిభవంబు సూడలేనైతి.' 80

ద్విపద. అని కుమారుని దేర్చి యవనీశ మౌళిఁ
గనుగొని పలికె నా కపిచక్రవర్తి -
'యో మహాత్మ ! దయాపయోనిధి ! రామ !
భూమీతలేశ ! నాపుణ్య మెట్టిదియో
నీచేత మృతిఁబొంద నేఁడు నా కబ్బె ;
నాచారపరులకు నందగరాని
వైకుంఠ మెదురుగా వచ్చె నిచ్చటికిఁ

గైకొంటి, నా పాతకములెల్లఁ బాసె ;
నేను ధన్యుఁడనైతి, నిహపరంబులకు ;
భానువంశాధీశ ! భవనాశ ! రామ !
ప్రాణముల్ నిర్వహింపవు మేన నింక
బాణంబు తీయవే పార్థివోత్తంస !'
నావుడు రామభూనాథుండు చేరఁ
గా వచ్చి నిజభుజాగర్వంబు మెఱసి
కపికులాధీశు వక్షము గాఁడియున్న
విపులసాయక ముద్దవిడి పెల్లగించె ;
నప్పుడు రఘురాము నాత్మలో నిల్పి
యొప్పుగా నింద్రజుఁ డూర్ధ్వలోకమున
కరిగె ; నావేళఁ దారాదికామినులు
గురుతరధ్వనులతో గుంపుగా నేడ్వ
నంగదుఁ డధికశోకాంధకారమున
బ్రుంగుఁడై నేలపైఁ బొరలంగఁ జొచ్చె. 81

వ. అప్పు డయ్యంగదుని శోకంబు భరింపలేక సుగ్రీవాదివానరులు మహారోదనంబు చేసి రక్కోలాహలంబు మందర మథిత మహార్ణవంబుఘోషంబు ననుకరించె ; తదనంతరంబ. 82

క. తారాది సతుల శోకము
వారించి కుమారుఁ దేర్చి వాలికిఁ బరలో
కారోహణాది సత్క్రియ
లారవితనయుండు రాము నానతిఁ జేసెన్. 83

వ. అంత నా రామచంద్రుండు కపివీరులం బిలిపించి 'సుగ్రీవునిఁ దోడ్కొనిపోయి కిష్కింధలో రాజ్యపట్టంబు గట్టుం; డంగదు యువరాజ్యపట్టంబు గట్టుం' డని యానతిచ్చి పంపిన కపి

వరులు రవిసుతుని పురంబునకు దోడ్కొనిపోయి రప్పుడు
పురజను లే మనుచున్నారు. 84

జంపె.

'కటకటా ! యేల నిష్కారణము జంపె నీ
కుటిలునకుఁగా వాలిఁ గువలయేశ్వరుడుఁ ?'
'చెవిసిల్లుగట్టుకొని చెప్పి చంపించె నీ
రవిసుతుండే ద్రోహి ; రాముఁ డే మెఱుఁగు ?'
'ఎవ్వరును జంపింప రీ పాపకర్ముఁడే
క్రొవ్వి చచ్చెను తార, కొడుకు వర్ధనఁగన్
దశరథాత్మజుతోడ తగునె వైరము హస్తి
మశకాంతరము వెఱ్ఱిమర్కటముగాక.'
'మనకేమిటికి వాలి యినతనూజుఁడు మేలు
జనులపాలిఁట వాఁడు శాంతవర్తనుఁడు' 85

వ. అని పలుకు సమయంబున సకలవానరులు కిష్కింధలో
బట్టంబుగట్టి రట యెటువలెను. 86

అర్ధచంద్రికలు.

స్వర్ణకుంభములందు గంగాజలము దెచ్చి
అంబుజాప్తతనూజు నభిషేకంబు సేసి
ఫాలదేశమునందు బంగరు పటము గట్టి
యునిచి రర్కతనూజు సింహాసనమునందు. 87

వ. తదనంతరంబ యంగదునకు యువరాజ్యపట్టంబు గట్టి రప్పుడు
పుణ్యాంగనలు ధవళంబులు పాడిరఁట యెటువలెను. 88

ధవళములు.

శ్రీరాముఁడు గుణధాముఁడు వారిజదళలోచనుఁడు
శూరత రావణుఁ గూలిచి నారీమణిఁ దేవలయున్. శోభానామే
రామునికృప కపిరాజ్యము క్షేమంబునఁ బాలించి
శ్రీమంతుఁడు సుగ్రీవుఁడు భూమండలి పొగడొందున్. శో.
సంగరవిజయముతో నుప్పొంగెడు సుగ్రీవునకు
సంగతిగా యువరాజై యంగదుఁ డిలఁ బెంపొందున్. శో. 89

వ. అప్పుడు సుగ్రీవుండు సకలవానరసమేతంబుగాఁ గానుకలు గొంచు రామచంద్రుని సేవింపవచ్చు నప్పు డగ్గిరప్రాంతంబున నున్న చెంచెతలు ఏలలు పాడి రట యెటువలెను. 90

ఏలలు.

'భానువంశమునఁ బుట్టి
దానవకామినిఁ గొట్టి
పూని మఖము నిర్వహింపవా, ఓ రామచంద్ర !
మౌనివరులు సన్నుతింపంగాన్
రాతి నాతిఁ జేసి పురా
రాతి చేతివిల్లు విఱిచి
భూతలేంద్రు లెల్ల మెచ్చఁగా, ఓ రామచంద్ర !
సీతను వివాహమాడవా.
పరశురాము భంగపఱిచి
భరతునకు రాజ్య మిచ్చి
గురుఁడు పనుప నడవి కేఁగవా ఓ రామచంద్ర !
సురలు భూసురులు మెచ్చఁగా,

పాపజాతి సుప్పనాతిఁ
గోపగించి ముక్కు చెక్కి
యేపునను ఖరుని ద్రుంచవా, ఓ రామచంద్ర!
చూపు నిల్పి మృగము నేయవా.
దేవుఁ డని తెలియలేక
కావరించి వాలి నచ్చె
దేవ! నీతో నిగ్రహించిన ఓ రామచంద్ర!
రావణునికి నిదే పాటురా.' 91

వ. అంత సుగ్రీవుండు రామచంద్రునిఁ జేరవచ్చి కానుక లొసంగి సాష్టాంగదండప్రణామంబు చేసి యేమని వినుతించుచున్నాఁడు.

సీ. 'దండంబు శార్ఙ్గకోదండమండితహస్త!
దండంబు వైకుంఠధామ! నిత్య!
దండంబు కుండలీంద్ర సుమౌక్తికచ్ఛత్ర!
దండంబు దుర్జనఖండ! దేవ!
దండంబు వారాశిదర్పసాహసజైత్ర!
దండంబు దశరథతనయ! వీర!
దండంబు మౌనీంద్రతతినిత్యపోషక!
దండంబు యిందిరాధామవక్ష!

గీ. దండ మినవంశజలనిధితారకేశ!
దండ మఘహార! యాతతధవళకీర్తి!
దండ మౌ నీకు లోకేశ! ధవళనయన!
దండ' మని కేలు మొగిచె నా తపనసుతుఁడు. 93

జంపె.
'అరిభయంకరరామ! అమితగుణసంసీమ!
కరుణాభిరామ! శ్రీకాకుత్స్థరామ!

రవికులాంబుధిసోమ ! రాజకులసుత్రామ !
రవికోటిసమధామ ! రామాభిరామా!' 94

వ. అని సన్నుతించి 'రాఘవేశ్వరా! మీ రిచ్చోట నుండ నేమిటికిఁ గిష్కింధకు వేంచేయుం' డని పలికిన రాఘవేంద్రుండు సుగ్రీవునితో నే మనుచున్నాఁడు. 95

ద్విపద. 'వనజాప్తనందన ! వనవాసమునకుఁ
జనుదెంచి మునివృత్తిఁ జరియించుచుండి
పట్టణంబులకు భూపతుల చందమున
నెట్టు రావచ్చు; నీ వెఱుఁగవే నీతి;
వానకాలము వచ్చె; వైరులమీఁదఁ
బూని కయ్యముసేయఁ బోఁగూడ దిపుడు;
మా తమ్ముఁడును మేము మాల్యవంతమునఁ
బ్రీతి నుండెదము సుగ్రీవ ! నీ వేఁగి
యీ నాల్గునెలలును నెలమిఁ గిష్కింధ
లో నుండి వర్షంబు లోఁబడునపుడు
సనుదెమ్ము వానరసైన్యంబుతోడ'
నని, భానుసుతుఁ బంపి యనుజుండుఁ దాను
మనుజేశ్వరుఁడు పోయె మాల్యవంతమున;
కినతనూజుండు కిష్కింధ కేతెంచి
తారాసమేతుఁడై తరుణీకృతోప
చారుఁడై వేడ్కలు సలుపుచు నుండె. 96

మంగళము

ఇందిరావరునకు నిభభయహరునకు
కందర్పగురునకు కల్యాణం.
సుందరబాహునకు సురుచిరదేహునకు
కందర్పగురునకు కల్యాణం.
దీనకరకులునకు దీనమందారునకు
ఘననీభగాత్రునకు కల్యాణం.

ద్విపద. అని సమస్తాసురారాతికదంబ
వినమితనిజభుజావిక్రము పేర
సురచిర ప్రార్థనా సుభగంభవిష్ణు
వరహోవతార శ్రీవాసుని పేర
నాతతార్చన లాలనాతిశయాళు
భీతరక్షణు పేర స్పృహయాళు పేర
నిగమగోచరు పేర నిఖిలలోకేశు(
డగు కందుకూరి జనార్దను పేర
నంకితంబుగ( గాళికాంబాప్రసాద
సంకలిత కవిత్వచాతుర్యధుర్య
తావర్య (ద్య) పెదలింగ నార్యతనూజ
కోవిద స్తవనీయగుణ రుద్రధీర
విరచిత సుగ్రీవవిజయాభిధాన
కరుణభాసుర యక్షగానప్రబంధ
మాచక్రవాళశైలావనియందు
నాచంద్రతారార్కమై యొప్పు(గాత.